నెహ్రూ బాల పుస్తకాలయం-43

# జొరాసంకో ఇల్లు

(రవీంద్రుని బాల్యము)


రచన

లీలా మజుందార్

అనువాదం

దుద్దుకూరు కృష్ణారావు





నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

క్రొత్త ఢిల్లీ

# ఒకటి

కలకత్తాలో ఉత్తరం వైపు ఒక చిన్న సందులో చిత్రమైన ఇల్లొకటి ఉంది. అందులో మెలికలు తిరిగిన మెట్ల వరసలు ఎన్నో ఉన్నాయి. అవన్నీ అనుకోని విధంగా తలుపులు మూసిన గదులకు దారి తీస్తాయి. అందం చందం లేకుండా, ఎగుడు దిగుడుగా ఉండే బాల్కానీలు ఉన్నాయి. ఇంటి ముందు భాగంలో మాత్రం గదులు, నడవలు విశాలంగా పాలరాతి నేలతో మిసమిసలాడుతుంటాయి. పొడవైన కిటికీలకు రంగు రంగుల అద్దాలుంటాయి. ఆ ఇంటి ప్రహారీ గోడ లోపల మరికొన్ని పెద్ద భవనాలు, పచ్చిక బయళ్ళు, పూల పొదలు, రాళ్ళు పరచిన దార్లు ఉన్నాయి. ఆ విశాల ప్రాంతం చుట్టూ ఎత్తయిన ప్రహారీ గోడ ఉంది. రెండు పెద్ద గేట్లు ఉన్నాయి. అవి తెరిస్తే ఎదురుగా ఆ చిన్న సందు కనిపిస్తుంది.

చుట్టు పక్కల వాళ్ళు ఆ ఇంటిని టాగూర్ల ఇల్లని అంటారు. ఈస్ట్ ఇండియా కంపెనీ కాలంలో అంటే సుమారు రెండు వందల సంవత్సరాల క్రితం ఆ ఇంటిని కట్టారు. అప్పటి నుంచి కూడా టాగూర్ల కుటుంబం అక్కడ నివసిస్తూ వచ్చింది. అవసరమైనప్పుడల్లా ఆ ఇంటిని మరింతగా పెంచుకొంటూ పోయారు. అసలు ఆ కుటుంబం పేరు ఠాకూరు కుటుంబం. కాని ఏళ్ళు గడిచిన కొద్దీ అది టాగూరు కుటుంబంగా మారిపోయింది.

ఇంగ్లీషు వాళ్ళు మనదేశంలోని పేర్లను ఇట్టే మార్చేశారు. "బర్ ధామన్" బుర్ద్వాన్ అయింది. "చీమరా" కాస్త చిన్‌సురాగా మారింది. "మిత్ర", మిత్తర్ కాగా, "ఠాకూర్" టాగూరు అయిపోయాడు. ఏమైనా టాగూర్ల

కుటుంబానికి ఈ కొత్త పేరు నచ్చినట్టే ఉంది. ఇంగ్లీషులో వాళ్ళ పేర్లు వ్రాసు కొనేటప్పుడు టాగూర్లు అనే వ్రాసుకొనేవారు. కాని ఈ నాటికీ బెంగాలీలో మాత్రం ఠాకూరు అనే వ్రాస్తుంటారు.

ఇందాకా చెప్పిన సందులో ఒక చిన్న గుడి ఉంది. అది శివాలయం. చాలా కాలం నాటిది. ఇప్పటికీ ఆ ప్రాంతమంతా వెనుకటి కాలాన్ని గుర్తు తెస్తూ ఉంటుంది. ఆ చిన్న సందు పెద్ద బాటను కలిసేచోట పాడు బడ్డ ఇల్లొకటి ఉంది. వీధి తలుపు తీసి ఉంటే లోపలి పెరడు బాగా కనిపిస్తుంది. అక్కడ ఇత్తడి దిమ్మ లున్నాయి. ఇంచుమించు ప్రతి దిమ్మ మీదా ఒక పచ్చటి చిలుక కూర్చుని ఉంటుంది. వాటి కీచు కీచు ధ్వనులతో ఆ ప్రాంతమంతా మారుమోగుతూ ఉంటుంది. ఈ వాతావరణం కాస్త చిత్రంగానే ఉంటుందని చెప్పవచ్చు.

నూరేళ్ళ క్రితం నాటిమాట. ఒక మధ్యాహ్నం బాగా వాన కురుస్తోంది. అందమైన కుర్రాడొకడు కిటికీలోనుంచి నీళ్ళు నిండిన సందు వైపు చూస్తున్నాడు. అతడు మామూలు నూలు బట్టలు వేసుకొన్నాడు. కాళ్ళకు చౌకరకపు చెప్పు లున్నాయి. ఆ అబ్బాయి జుట్టు బాగా పొడవుగా ఉంది. నిజం చెప్పాల్సి వస్తే కుర్రాడు కాస్త మడ్డి మడ్డిగా ఉన్నాడనవచ్చు. అతను చూడటానికి అచ్చు ఆడ పిల్లలా ఉంటాడని కొందరు అనేవారు. ఒకసారి స్కూలు పిల్లల్లో ఒక మాట అల్లుకు పోయింది— అసలు ఆడపిల్లే మగ దుస్తులు వేసుకొందని. ఈ విషయం తేల్చుకోటానికి స్కూలు కుర్రాడు ఒకడు ఈ అబ్బాయిని తమ ఇంటికి 'టీ' కి పిలిచాడు. ఇంటికి వచ్చాక ఎత్తయిన బెంచీ మీద నుంచి కిందకు దూకమన్నాడు. ఎందుకంటే ఆడపిల్లయితే నెమ్మదిగా ఎడమకాలు కిందకు పెట్టి దిగుతుందిట. ఈ అబ్బాయి జంకూ గొంకూ లేకుండా బెంచీ మీదనుంచి దూకాడు. ఆ తర్వాత చాలా రోజుల వరకు ఆ 'టీ' పార్టీ అసలు ఎందుకు జరిగిందో తెలియలేదు అతనికి. ఈ అబ్బాయే రవీంద్రనాథ్, ముచ్చటగా రవి.

వాన కురిసే ఆ మధ్యాహ్నం ఎనిమిదేళ్ళ రవి తన మాష్టారికోసం ఎదురు చూస్తున్నాడు. వీధుల్లో నీళ్ళు నిండిన కారణంగానైనా మాష్టారు రాకపోతే

బాగుండునని వెయ్యి దేముళ్ళకు మొక్కుకుంటున్నాడు. కాని ఏం లాభం? సరిగ్గా ఆ నిమిషానికి మాష్టారుగారి నల్లగొడుగు వీధిలో కనిపించింది. రవికి ఇంకే మార్గమూ లేదు. ఏమంత వెలుగు రాని కింది గదిలో కూర్చుని కళ్ళపై నిద్రకూరుకు వచ్చే వరకూ ఇంగ్లీషు, లెక్కలు, విజ్ఞాన శాస్త్రం, చరిత్ర, భూగోళం పాఠాలు చదవక తప్ప లేదు. మానవ శరీరంలోని ఎముకల గురించి తెలుసుకొన టానికి పాపం అస్థిపంజరం కూడా పట్టుకోవలసి వచ్చింది. చిత్రమేమిటంటే మాష్టారు ఇల్లు వదిలి పెట్టగానే రవీంద్రుని నిద్ర ఎక్కడికి ఎగిరిపోయిందో తెలియదు.

మిణుకు మిణుకు మనే దీపం వెలుగులో రవి ఒంటరిగా పొడవైన వరండాలలో నడిచి వెళ్ళ వలసి వచ్చేది. ఆ దీపం వెలుగులో గోడలపైన వింత వింత వెలుగులు కనిపించేవి. ఈ సమయంలో వరండాలో ఎవరూ ఉండేవారు కాదు. పెరటివైపు కొందరు పనిమనుషులు కూర్చుని పాత పీలికలతో నూనె దీపాలకు కావలసిన వత్తులు చేస్తుండే వారు. పడకగదులకూ, వంటగదులకూ ఈ దీపాల అవసరం ఎంతయినా ఉండేది.

ఆరోజుల్లో ఎలక్ట్రిక్ లైట్లు లేవు. గ్యాస్ లైట్లు కూడా లేవు. తాగటానికి కావలసిన నీళ్ళు పెద్ద పెద్ద బానలలో పోసి ఏమాత్రం వెలుగురాని ఒక చీకటిగదిలో పెట్టి ఉంచేవారు. ఎప్పుడైనా ఈ గదిలోకి తొంగి చూస్తే రవికి వెన్నులో నుంచి చలి పుట్టుకొచ్చేది. ఇంటి వాడకానికి నీళ్ళ కొరతే లేదు. గంగా నదినుంచి కట్టిన కాలువలు వీళ్ళ పెరట్లోని తోటవరకు ఉండేవి. వరదల సమయంలో, నదిలోని నీళ్ళు ఉరవళ్ళు తొక్కుతూ వీళ్ళ ఇంటిలోకి వచ్చినప్పుడు, సూర్య కిరణాలు పడి ఆనీళ్ళు తళ తళ మెరుస్తున్నప్పుడు రవికి చాలా ఆశ్చర్యం, సంతోషంగా ఉండేది. ఒకోసారి చిన్ని చిన్ని చేపలు ప్రవాహంలో పాటు కొట్టు కొచ్చి, రవి చిన్నాన్న పెంచుకొంటున్న రంగుచేపల చెరువులో చేరిపోయేవి. చిన్న చేపలతో పాటు రవి హృదయం కూడా గంతులు వేసేది.

జనంతో నిండిపోయిన ఆ ఇల్లు చాలా అద్భుతమైనదే. అమ్మ, నాన్న, చిన్నా

న్నలు, పిన్నమ్మలు, మేనమామలు, మేనత్తలు, వాళ్ళ పిల్లలు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు, స్నేహితులు, స్నేహితుల స్నేహితులు, కళాకారులు, గాయకులు, రచయితలు......ఒకరనేమిటి, ఎందరితోనో ఆ ఇల్లు కళకళలాడుతుండేది. ఆ ఇంట్లో ఆడామగా ఎందరో పనివాళ్ళు ఉండేవారు. వాళ్ళందరికీ ఆ భవనంలోనే మారుమూల కొన్ని గదులుండేవి. గుమాస్తాలు, ఖాతాలు వ్రాసేవారు, సొమ్ము వసూలు చేసేవారు, సేవకులు, దర్జీలు, చాకలివాళ్ళు, బంగారం పనిచేసే కంపాలీలు – వీళ్ళందరూ ఆ భవనంలో ఉండేవారు. నిజానికి అదో ఇల్లులా కాక నగరంలా ఉండేది.

మహాత్మా గాంధీ, కస్తూర్బా, టాగూర్



పైనా, కిందా గదులు, ఇంటి ముందు విశాలంగా ఉన్న చెక్కమెట్లు, ఇంటివెనుక మెలికలు తిరిగే రాతిమెట్లు, చిన్న చిన్న పెరళ్ళు మొత్తం ఇంటిని రవి అసలు ఎప్పుడూ చూడలేదు.

ఆ పెద్దింట్లో ఒక చిన్న గదిలో 1861వ సంవత్సరం, మే నెల ఆరవ తేదీ రవి పుట్టాడు. వాళ్ళమ్మకు రవి పద్నాలుగో బిడ్డ. అందుకే తన అక్కల, అన్నల పిల్లలలో కొందరు రవి కంటే పెద్దవాళ్ళు ఉండేవారు.

రవి అన్నలలో ఒకరైన సోమేంద్ర, రవి పెద్దక్క కొడుకు సత్య—వీళ్ళిద్దరితో రవి చాలా స్నేహంగా ఉండేవాడు. సత్య రవి కంటే కాస్త వయసులో పెద్దవాడే. అతనితో రవికి సమయం చాలా సరదాగా గడిచి పోయేది.

''శాంతినికేతన్‌కు ఎప్పుడూ వెళ్ళొద్దు'' అనేవాడు సత్య ఏమో చాలా తెలిసి నట్టు.

''ఎందుకని'' అని అడిగాడు రవి. ''అక్కడికి నాన్నగారు వెళతారు. నాన్న గారి స్నేహితులూ వెళతారు. నాన్నగారికి అక్కడో ఇల్లు ఉంది. అంతెందుకూ నీవు కూడా అక్కడికి వెళ్ళొచ్చావుగా !''

''అవుననుకో. కాని అది చాలా భయంకరమైన ప్రయాణం. గుండెలు చేతిలో పట్టుకొని పోవాలి'' అన్నాడు సత్య.

''అదేమిటలా అంటావు'' అన్నాడు రవి బిత్తరపోతూ.

''రైలుబండి రవీ. రైలుబండి సంగతి నేను చెప్పేది. అది బండికాదు చావుకు వేసిన వల అనుకో. గర్జిస్తూ గర్జిస్తూ ముందుకు పరుగెత్తుతుంది. లోపలున్న వాళ్ళందర్నీ ఇటూ అటూ బలంగా ఊపేస్తుంది. దానిలోనుంచి ఎగిరి ఇవతలపడకపోతే అంతే చాలు.''

రవి వణికిపోయాడు. ''పోనీ అక్కడెలా ఉంటుందో చెప్పు. అదే శాంతి నికేతన్ లో''

''ఓ చాలా బాగుంటుంది. ఇంద్రజాలమనుకో. ఇంటి నుంచి వంట ఇళ్ల

వైపు ఒకదారి ఉంది. దానికి పైకప్పు ఏదీ లేదు. అయినా అక్కడ నీవు నడుస్తుంటే ఎండగాని, వానగాని నిన్ను తాకవు.''

రవి పెద్దవాడయ్యాక తన జీవితంలో చాలా భాగం శాంతినికేతన్‌లో గడిపారు. శాంతినికేతన్‌లో ఒక స్కూలు కట్టించారు. విశ్వ భారతిలో ఒక భాగంగా అది ఇప్పటికీ ఉంది. మహాత్మాగాంధి కూడ ఈ భవనం కట్టటానికి సహాయం చేశారు. మహాత్మునికి రవీంద్రుడంటే చాలా ఇష్టం. అందుకే అతన్ని గురుదేవ్ అని పిలిచేవారు.

ఇరవయ్యో శతాబ్దం ప్రారంభంలోనే గాంధీజీకి, రవీంద్రనాధునికి స్నేహం కుదిరింది. అప్పుడు గాంధీజీ ఆఫ్రికానుంచి కొందరు విద్యార్థులను తెచ్చారు. ఈ అబ్బాయిలు శాంతినికేతన్‌లో కొన్ని నెలలుండి చదువుకొన్నారు.

ప్రకృతి మధ్య పిల్లలను ఆడంబరం లేకుండా పెంచాలనే రవీంద్రుని భావంతో గాంధీజీ ఏకీభవించారు. పిల్లలు తమ పని చేసుకొంటూ ఇతరులకు సేవ చేయాలని వీరిద్దరూ భావించారు. దేశసేవ కోసం ఇటు జ్ఞానాన్ని పెంపొందించుకోవటమూ, అటు శరీరాన్ని ఆరోగ్యంగా, బలంగా ఉంచుకోవటమూ అవసరమేనని. చదువు సంధ్యల విషయంలో భారతదేశంలో అనాదిగా వస్తున్న పద్ధతులను తిరిగి అవలంబించాలని కూడా గాంధీజీ, గురుదేవ్ భావించారు.

# రెండు

రవి చిన్న పిల్లవాడిగా ఉన్నప్పుడు పనివాళ్ళ ఇండ్లకు దగ్గరగా, చిన్నపిల్లల్ని వుంచే ఓ గదిలో ఉండేవాడు. ఆ రోజుల్లో ధనవంతుల కుటుంబాలలో ఈ విధంగానే పిల్లలను పెంచేవారు. రాత్రిపూట పడుకోబోయే ముందో, లేక జబ్బు పడిన సమయాల్లోనో మాత్రమే పిల్లలు తమ తల్లులను చూసేవారు. తమ తండ్రులను చూడటం ఇంకా అరుదు. పిల్లలకు మంచి తిండిపెట్టి, మంచిబట్టలు తొడిగి, వాళ్ళకు కావలసినవన్నీ సమకూర్చ వలసింది పనివాళ్ళే. చిన్న పిల్లలు పెద్దలకు చికాకు కలిగించకుండా చూడడం మరింత ముఖ్యం. నిజానికి పనివాళ్ళు పిల్లలకు సరయిన తిండి పెట్టేవారు కాదు. పైగా ఈ విషయాలేవీ పెద్దలకు చెప్ప కూడదని పిల్లల్ని బెదిరించేవారు. అయితే రామాయణ, మహాభారత కథలు మాత్రం చెప్పేవారు. రవికి అవి బాగా కంఠతా వచ్చేవి.

రవిని చూసుకొనే పనివాడు రవికి ఏదో ఇంత తిండిపెట్టి, కిటికీ దగ్గర కూర్చో బెట్టేవాడు. అబ్బాయి చుట్టూ సుద్ద ముక్కతో ఒక గీత గీచేవాడు. కళ్ళుపెద్దగా చేసి, "ఇదిగో అబ్బాయిగారూ, నేను వచ్చేవరకు మీరీ గీతలోపలే ఉండాలి. ఒక వేళ ఈ గీత దాటి వచ్చారో — తెలుసుగా రామాయణంలో సీతమ్మగారు లక్ష్మణరేఖ దాటినందుకు ఏమయిందో! ఆ రాక్షసుడు ఎత్తుకుపోవటం గుర్తుందా?"

ఇలా బెదిరించి పనివాడు వెళ్ళిపోయేవాడు. గంటలకొద్దీ పాపం ఈ చిన్న కుర్రాడు ఆ గీత లోపలే కూర్చునేవాడు. చిన్న చెఱువును, దాని పక్కన ఉన్న మర్రి చెట్టును చూస్తూ గడిపేవాడు. ఆ చెరువులో స్నానాలు చేయటానికి చుట్టు

పక్కంల వాళ్ళు వస్తుండేవారు. పీటిలో మర్రిచెట్టు పీద పడుతుండేది. వెలుగుమారే కొద్దీ పీడలు మారేవి. ఇళ్ళని, చెట్లని, ఆకాశాన్ని చూస్తూ అలా కూర్చునేవాడు. ఇలా తను చూపిన విషయాలన్నీ బాగా గుర్తు పెట్టుకొనేవాడు. ఎన్నో ఏళ్ళ తర్వాత చెరువు పక్కన ఉన్న మర్రి చెట్టు గురించి ఇతనో పద్యం వ్రాశాడు. అప్పటికి ఆ చెరువుని పూడ్చి వేశారు. మర్రి చెట్టు ఎన్నడో మాయమయింది. కాని ఆ ఇల్లు ఆ కిటికీ ఇంకా ఉన్నాయి. అక్కడ రవి పుస్తకాలు, అతని చిన్న నాటి పద్యాలు కూడా ఉన్నాయి.

రవికి కాస్త చదువుకొనే వయస్సు రాగానే పనివాళ్ళ ఆలన, పాలన ముగిసింది. రవి తన అమ్మ నాన్నలతో, అన్నలతో అక్కలతో ఎక్కువగా కలిసిమెలిసి ఉండ సాగాడు. తన అన్నలు, మేనత్త, మేనమామల పిల్లలు ఏర్పాటు చేసే నాటకాలు చూడటానికి, పాటలు వినటానికి వచ్చేవాళ్ళ నెందరినో రవి చూసేవాడు. చిన్న పిల్లలకు ఈ నాటకాలలో వేషం దొరకదు. అంతెందుకు, ఎప్పుడో ఒకప్పుడు గాక తరచూ ఈ నాటకాలను చూడనిచ్చేవారు కూడా కాదు. అయితే పండుగలకు పబ్బాలకు జరిగే ఏర్పాట్లను పిల్లలు చూస్తుండేవారు. నాటకం జరుగుతున్నప్పుడు పాటలు, మాటలు అప్పుడప్పుడు వీళ్ళకు కొద్దిగా వినిపిస్తుండేవి.

పిల్లలు బాల్కనీలనుంచి, కిటికీలనుంచి ముందుకు ఒంగి, తమ చిన్నాన్న గారింటికి మెరుస్తున్న గుర్రపు బళ్ళలో వచ్చే అతిథులను చూసేవారు. వాళ్ళకి స్వాగతం చెప్పటానికి రవి అన్నగార్లూ వాళ్ళూ ఎదురొచ్చి అతిథులపై పన్నీరు చల్లే వారు. కోటు బొత్తాములలో పెట్టుకోవటానికి గులాబీ పువ్వులు ఇచ్చేవారు. నవనాగరికంగా ఉండే విదేశీయులు తమ స్త్రీలను కూడా వెంటతెచ్చేవారు. ఒకటి రెండుసార్లు ఇంగ్లీషు గవర్నరు జనరలే వచ్చారు. అదెంతో గొప్పగా ఉండేది.

టాగూర్ల కుటుంబం కలకత్తాలోని ప్రముఖ కుటుంబాలలో ఒకటి. వీరికి నగరంలోనే కాక జిల్లాలలో కూడా బాగా ఆస్తులుండేవి. వారు బాగా ధనవంతులు. చాలా నవనాగరికంగా ఉండేవారు. రవి తాతగారు, రాకుమార్ ద్వారకనాథ్

టాగూర్ అంటే ఈ దేశంలోనే కాక విదేశాలలో కూడ ప్రసిద్ధి. ఆయన చిన్న వయసులోనే మరణించారు. రవి తండ్రి, దేవేంద్రనాథ్ అప్పటినుంచి కుటుంబానికి పెద్దగా వ్యవహరించారు. ఆయన చాలా మేధావి. సదాచార సంపన్నుడు.

ఈనాటి భారతదేశానికి పునాదులు వేసిన వారిలో దేవేంద్రనాథ్ ఒకరని చెప్ప వచ్చు. ఆయన కూతుళ్లు, కోడళ్లు తమ ఘోషా విస్మరించి, ఇంగ్లీషు చదువులు చదవుకొన్నారు. బెంగాలీ స్త్రీలలో ఈ విధంగా ముందడుగు వేసిన వారిలో వీళ్లే మొదటివాళ్లు. వేషభూషలలో, మాటామంతీలో ఆధునికంగా ఉండాలనుకొనే స్త్రీలకు, ఈ కుటుంబంలోని స్త్రీలు ఆదర్శమయ్యారు. వీరు విద్యాబుద్ధులలోనే గాక, భారత దేశ సంస్కృతి, కళల గురించి కూడా బాగా తెలుసుకొన్నారు. తమ దేశాన్ని చూసి వీరెంతో గర్వించేవారు.

రవి చాలా చిన్న వాడయినందువల్ల మొదట్లో ఇవి అంతగా అర్థమయ్యేవి కావు. కాని వాళ్ళింట్లో చాలా గొప్ప విషయాలు జరుగుతున్నాయని మాత్రం అతనికి తెలుసు. దురదృష్టవశాత్తు, పాఠాలు చదువుకోవటంలోనే తన సమయ మంతా గడచిపోయేది. సరదాగా గడపటానికి చాలా తక్కువ వ్యవధి చిక్కేది. తమ ఇంట్లో ఒకచోట రాజభవనం ఉందని అతని స్నేహితులనే వారు. అదెక్క డుందో వెతకటానికి కూడ రవికి సమయం చిక్కేది కాదు.

"నువ్వు దాన్ని చూశావా?" అని రవి తన స్నేహితురాలిని ఒకసారి అడిగాడు.

"ఇప్పుడు అక్కడి నుంచే వస్తున్నా" అని ఆ పిల్ల సమాధానం చెప్పింది.

కాని రవికి ఎప్పుడూ ఆ భవనం తటస్థ పడలేదు. నిజమే మరి. అది అసలక్కడ ఉంటేగా. అంతా ఆ పిల్ల ఊహించిందేనాయె.

మొదట్లో బడికి వెళ్ళాలని రవికి చాలా ఉబలాటంగా ఉండేది. సత్యను, సోమేన్‌ను తీసుకెళ్ళటానికి పొద్దుటి పూట గుఱ్ఱపు బగ్గీ రాగానే తానూ బడికి వెళతానని మారాం చేసేవాడు. చివరకి పెద్దలు ఒప్పుకొన్నారు. రవి బడికి పోయాడు.

ఇంట్లో రవికి పాఠాలు నేర్పే మాష్టారికి ఎంతో కోపం వచ్చింది. ఛెళ్ళున

చెంపకాయ కొట్టారు. "ఇంకెన్నాళ్ళురే. చూస్తూంది. బడి వద్దు మొర్రో అని ఇంతకంటె పెద్దగా రాగాలు పెడతావా లేదో" అన్నారు.

అసలు జరిగింది అంతే. రవికి బడి అంటే మొదటి రోజే అయిష్టం ఏర్పడింది. చాలా మంది పిల్లలతో కూర్చుని నాలుగు గోడల మధ్య చదివిందే చదవాలంటే విసుగొచ్చేది. కాస్త ఆరుబయటి గాలి, నీలాకాశం, పచ్చని చెట్లు చూడాలంటే కుదిరేదే కాదు. ఏ మాత్రం స్వేచ్ఛ ఉండేది కాదు. ఆటలాడుకొనే సమయంలో కూడా టీచర్లు వీళ్ళ వెంటే ఉండే వారు.

స్కూలు ఎలా ఎగ్గొట్టాలా అని రవి ఆలోచించాడు. తన అన్నలకు అరబిక్, పర్షియన్ భాషలు నేర్పే మున్షీని బతిమాలి తన క్లాసు టీచరుకు చీటీలు వ్రాయించే



జొరాసాంకోలో ప్రాచీన పూజామండపం

వాడు 'రవి ఈ రోజు బడికి రాడు' అని. ఈ పద్ధతి కొన్నాళ్ళు పనికి వచ్చింది. ఏదేమైనా రవికి బడిలో సైన్సు క్లాసు, డ్రాయింగ్ క్లాసు బాగా నచ్చాయి.

పద్యాల రూపంలో వ్రాస్తే పదాలలో సంగీతం ఉందని గుర్తించగానే రవి కెంతో సంబరమయింది. ఒక చిన్న నీలం రంగు పుస్తకంలో కొన్ని పంక్తులు వ్రాసుకొన్నాడు. ఆ పుస్తకం ఎప్పుడూ తన జేబులో పెట్టుకొని తిరిగేవాడు. సత్య, సోమేన్‌లు రవి పద్యాలు చదివి ఆశ్చర్య పోయారు. చాలా బాగున్నాయన్నారు. అంతేకాక అందరూ ఆ పద్యాలు చదివేటట్లు చేశారు.

త్వరలోనే నీలం పుస్తకం రవి రచనలతో నిండిపోసాగింది. రవికి స్నేహితులలో పలుకుబడి పెరిగింది. టీచర్లు కూడా ఈ పద్యాలు చదివి రవిని మెచ్చుకొన్నారు. చివరికి ఈ విషయం రవి తండ్రి దేవేంద్రనాథ్ గారి చెవిన పడింది. ఆయన రవి పద్యాలు చదివి చిరునవ్వు నవ్వారు.

చాలా కష్టపడి వ్రాయకపోతే ఈ పద్యాలు కుదిరేవేకావు. రవి అక్క కొడుకు, రవి కంటే పెద్దవాడు, ఛందస్సు, లయ, పద్యాలకు ఎంత అవసరమో తెలియ జెప్పాడు. పద్యాలు వ్రాస్తూనే ఉండు అని రవిని ప్రోత్సహించారు.

రవి అలాగే చేశాడు. ఫలితం బాగానే ఉండేది. సోమేన్, సత్య కూడా రవిని బాగా ప్రోత్సహించారు.

# మూడు

రవికి బడి అంటే అసలు గిట్టటం లేదు. తుంటరి పిల్లలను టీచర్లు బాగా దండించే వారు. వాళ్ళని ఎఱ్ఱని ఎండలో నిలుచో బెట్టేవారు. రెండు చేతులు పక్కకు చాపి ఒకో చేతిలో ఒక ఇటుక పట్టుకోవలసి వచ్చేది. ఇటుకలు పడిపో యాయా, మరిన్ని దెబ్బలు తగిలేవి. రవి తుంటరివాడు కాదు. అందుకే దండనకు గురికాలేదు. కాని తన తోటివారు అనుభవించే శిక్షలు చూసి భయంతో వణికి పోయేవాడు.

ఈ దుఃఖం మరచిపోటానికి, రవి వాళ్ళింట్లో మిద్దెపైన వరండాలో చిన్న స్కూలు ఏర్పాటు చేసుకొన్నాడు. కొయ్య ఊచలు అతని విద్యార్థులు. వాళ్ళ విషయంలో రవి చాలా కఠినంగా ఉండేవాడు. వాళ్లందరూ రవికి బాగా గుర్తే. వాళ్ళలో కొందరు బాగా మొద్దులు. బాగా దెబ్బలు పడితేగాని పాఠాలు నేర్చుకొనే వారుకాదు. అందుకే రవి బాగా కొట్టేవాడు. వాళ్లు దెబ్బలకు ఊగిసలాడి కీచు కీచు మంటుంటే రవికి ఆ ఆట నిలిపివేయవలసి వచ్చింది.

రవికి మరో ఆట కనిపించింది. కింద, పనివాళ్ళ ఇళ్ల దగ్గిర, ఒకపాత పల్లకీ పడి ఉంది. దాని తలుపులు తెరవటానికి, మూయటానికి ఇంకా వీలుంది. కొన్ని చెమికీల అలంకారాలు కూడా మిగిలి ఉన్నాయి. దానిలోని మెత్తలు చిరిగి పోయి వాటి ఋూరుగ దూది అంతా బయటికి వచ్చింది. కాని ఆ పల్లకిలో కూర్చుని రవి కలలోకి జారిపోయేవాడు. తన పల్లకిని ఎనిమిది మంది బోయీలు మోస్తున్నారట. భయంకరమైన అడవి దారిన వెళుతున్నారట. అడవి నిండుగా క్రూర జంతువులు

ఉంటాయి. దొంగలు పొదల మాటు నుంచి వస్తారు. వాళ్ళ కళ్లు ఎర్రగా చింత నిప్పుల్లా ఉంటాయి. వాళ్ళ చేతుల్లో ఈటెలూ, బాకులూ మరేవేవో ఉంటాయి. 'రే, రే, రే' అని అరిచి పెద బొబ్బలు పెడుతుంటారు......... అదృష్టం కొద్దీ వల్లకి తలుపు తెరచి కిందకు వస్తే చాలు ఈ ప్రమాదాలన్నీ తొలగిపోయేవి.

ఈ ఇంట్లోని పిల్లలు పెద్దల ప్రపంచానికి దూరంగా ఉండేవారు. పెద్దల ప్రపంచంలో సంగీతం, పుస్తకాలు, నాటకాలు, నటన, దేశభక్తికి సంబంధించిన కార్యక్రమాలు ఉండేవి. పెద్దల మాటలు అప్పుడప్పుడూ పిల్లల చెవిని కూడా పడుతుండేవి. ఈ విధంగా వాళ్ళు ఎన్నో విషయాలను నేర్చుకొన్నారు. ఎందరినో ప్రముఖులను చూడగలిగారు.

టాగూర్లు బెంగాలు సమాజానికి నాయకులుగా ఉండేవారు. భారతదేశంలోని గొప్ప తనమేమిటో, యూరప్‌లో ఉన్న మంచి ఏమిటో వీరు గ్రహించారు. తమ దేశానికి ఏది అవసరమో వీరికి తెలుసు. నేటి విజ్ఞాన శాస్త్ర ప్రాముఖ్యము, ఆధునిక భాషల ప్రాముఖ్యము రవి వీరి నుంచి గ్రహించాడు. రామాయణం, మహాభారతం కూడా జీవితంలో అతి ముఖ్యమని, భారతదేశంలో విద్య వీటి మీద ఆధారపడి ఉండాలని గ్రహించాడు.

పురాతనమైన మతాలను, సాంప్రదాయాలను, ఆదర్శాలను, ఆచారాలను గౌరవించటం నేర్చుకొన్నాడు. వీటిని బాగు పరచవీలుందని తెలుసుకొన్నాడు. అయితే పాశ్చాత్యులను వెర్రిగా అనుకరించటం పొరబాటని, వారి మంచి పద్ధతులను గ్రహించటంలో తప్పులేదని రవి గ్రహించాడు.

రామాయణ, మహాభారతాలంటే రవికి ఎంతో ఇష్టం. వాళ్ళింట్లో పడక గదులలో అద్దాల బీరువాలలో పెట్టిన పాత బెంగాలీ పుస్తకాలను చదివే మార్గం కూడ రవి అప్పుడు కనుక్కొన్నాడు. అవ్వగారి చీర కొంగున ఉన్న తాళం చెవులు గుట్టు చప్పుడు కాకుండా తీసుకొని, అలమారాలు తెరచి పుస్తకాలు చదివేవాడు. సెలవుల్లో మధ్యాహ్నంపూట ఇంట్లో ఆడవాళ్ళు బట్టలు కుడుతూనో వచ్చుళ్ళుచేస్తూనో, వక్కలు పగలగొడుతోనో ఉన్నప్పుడు రవి వాళ్ళకు కథలు చదివి వినిపించేవాడు. రవి

చదివే కథలలో యూరపీయ కథలకు అనువాదాలు కూడా ఉండేవి. ఈ కథలు చదువుతూ రవి, అతని శ్రోతలు వాటిలో పూర్తిగా లీనమై పోయేవారు. ఆయా సందర్భాన్ని బట్టి నవ్వేవారు. ఏడ్చేవారు. రవి తల్లి కొడుకును చూసుకొని తెగ మురిసిపోయేది. "ఇంత చిన్న వయస్సులో ఇంత తెలివి తేటలు ఎంత మంది కుంటాయి?" అనేది. రవి అమ్మ మాటలకు ఉబ్బి పోయేవాడు.

స్కూలంటే రవికి అసలు పడకపోయినా అన్ని విషయాలూ చక్కగా నేర్చుకొన్నాడు. ఇల్లంతా జ్ఞాన సంపదతో నిండి ఉండేది. అతని మూడో అన్నగారు ఈ ఏర్పాట్లన్నీ చూసుకొనేవారు. ఒక మాష్టారి తర్వాత మరో మాష్టారు వచ్చి వెళుతుండేవారు. ఎన్నో భాషలు, లెక్కలు, శాస్త్రజ్ఞానం, చిత్రలేఖనం, సంగీతం, ఇవన్నీ నేర్పేవారు.

ఒక బుద్ధివికాసానికే కాక శరీరం విషయంలో కూడా శ్రద్ధ తీసుకొనేవారు. ఇంటి కాంపౌండులో ఒక మూల దీనికని కేటాయించారు. చిన్న పిల్లలు, యువకులు మల్లయుద్ధం తెలిసినవారి వద్ద కుస్తీ పట్లు నేర్చుకొనేవారు. ఆ నేలంతా మంచి నూనెతో మునిగి తేలుతుండేది. ఇప్పటికీ ఆ భాగం జిడ్డుగా ఉండటం మనం చూడవచ్చు.

రవి తల్లి చాలా కంగారు పడిపోయేది. "అసలే నా బిడ్డలందరిలోకీ రవి నల్లటివాడు. ఈ కుస్తీ పట్లు వాని రంగు మరింత పాడు చేస్తాయి." అని ఆమె వాపోయేది. నిజానికి ఎర్రగా, అందంగా ఉండే రవికి తన అన్నదమ్ముళ్ళలో, అక్కచెల్లెళ్ళలో నల్లటివానిగా ఎందుకో పేరు వచ్చింది.

ఆదివారం పూట కుస్తీ ఉండేది కాదు. రవి తల్లి రవిని చిన్న పీటమీద కూర్చోబెట్టి, వొళ్ళంతా నూనె పట్టించి, సువాసనలు వెదజల్లే నలుగులతో రవి శరీరానికి పట్టిన మురికంతా వదిలించేది. అమ్మ ఆరాటం చూస్తుంటే రవికే నవ్వు వచ్చేది.

కొన్ని సమయాల్లో ఇల్లంతా సంగీతంతో ప్రతి ధ్వనిస్తుండేది — శాస్త్రీయ సంగీతం, ఆధునిక సంగీతం, భారతదేశ సంగీతం, పాశ్చాత్య సంగీతం — ఇలా

రకరకాల సంగీతం వినిపిస్తుండేది. కుటుంబాని కంతటికీ సంగీతమంటే ప్రాణం. చాలమందికి శ్రావ్యమైన కంఠం ఉండేది. ఒకటి, రెండుసార్లు వింటేచాలు రవికి ఏ రాగమయినా ఇట్టే వచ్చేసేది.

ఇన్ని మంచి లక్షణాలున్నా, రవికి స్కూలంటే అసలు గిట్టకపోవటంతో పెద్దలంతా చాలా నిరాశ పడ్డారు. "వీడింక ఎప్పటికీ బాగుపడడు" అనుకొన్నారు.

రవి తండ్రి దేశమంతా పర్యటిస్తుండేవారు. రవి బాగోగులు అన్నగార్లే చూసుకొనేవారు. రవి విషయాలు తండ్రి ఎప్పటికప్పుడు ఉత్తరాల ద్వారా తెలుసు కొనేవాడు.

రవికి గంభీరంగా, ఆచారవంతంగా ఉన్న తన తండ్రి అంటే ఎంతోగౌరవం. ఆయన అందంగా ఉండేవారు. సంస్కృతం బాగా చదువుకొన్నారు. మరెన్నో విషయాలలో ఆయన జ్ఞాన సంపన్నుడు కాని రవి ఎప్పుడూ తండ్రికి సన్నిహితం కాలేదు ఆయన పనులకు అడ్డువస్తాడని, పెద్దలు రవిని అంతగా ఆయన దగ్గరకు వెళ్ళనిచ్చేవారుకాదు.

ఒకసారి రవి తండ్రి హిమాలయ ప్రాంతంలో పయనిస్తున్నారు. హిమాలయాల చాటు నుంచి రష్యనులు భారతదేశంపై దాడి చేస్తారని అర్థం పర్థం లేని వదంతి ఒకటి పుట్టింది. రవి తల్లి చాలా భయపడిపోయింది. "రష్యా వాళ్ళు అటే వస్తారట - మీ నాన్న గారేమో అటువైపుల ఉన్నారు. రవీ నువ్వు మంచి కుర్రాడివి కావీ కాస్త మీ నాన్నగారికి ఉత్తరం వ్రాయి బాబూ. ఇంటికి రమ్మని వ్రాయి." అంది.

రవి ఎప్టేటు గుమాస్తాలలో ఒకరి సాయంలో వాళ్ళ నాన్నగారికి ఉత్తరం వ్రాశాడు. ఉత్తరం ఎలా ప్రారంభించాలో, ఎలా ముగించాలో ఆ గుమాస్తా రవికి నేర్పించాడు ఆ ఉత్తరం రవి తండ్రికి చేరింది. అప్పుడు భలేతమాషా జరిగింది. రవి పేర ఒక ఉత్తరం వచ్చింది అది వాళ్ళ నాన్నగారు స్వయంగా వ్రాసిన ఉత్తరం. "నువ్వేమీ దిగులు పడకు. ఒకవేళ రష్యావాళ్ళు వచ్చినా నేనే వాళ్ళందరినీ



దేవేంద్రనాథ్ టాగూర్

తరిమేస్తాను.'' అని ఆయన వ్రాశారు. తన తండ్రి దగ్గర నుంచి మొదటి ఉత్తరం అందుకొన్న సంబరం రవికి జీవితాంతం గుర్తుంది.

ఆ రోజుల్లో ఆ ఇంట్లో రవికి ఏమంత ప్రాముఖ్యం ఉండేదికాదు. అతని పేరుకూడా బయటి వాళ్ళకు తెలిసేదికాదు. బళ్ళో చదువుకొనే పిల్లలకు మాత్రం రవి తెలుసు. బడిలో కూడా రవి ఏమంత గొప్పగా చదివేవాడు కాదు. చదువు అంతంతమాత్రమే. చాలా నిశ్శబ్దంగా పాఠాలు వినేవాడు. దగ్గరి స్నేహితులు కూడా ఎవరూ లేరు.

టాగూరు కుటుంబం సామాజికంగా ఎప్పుడూ ఏదో ఒక పనిలో నిమగ్నమయి ఉండేది. సాంస్కృతిక కార్య కలాపాలలో, దేశానికి సంబంధించిన పనులలో వీళ్ళు

మునిగి ఉండేవారు. కాని ఆ ఇంటి పిల్లలు సాధారణంగా ఇల్లుదాటి పోయే వారు కాదు. ఆ ఇంట్లోనే వాళ్ళకు కావలసినన్ని వింతలుండేవి. రవి పాత పల్లకిలో కూర్చుంటే చాలు. ఊహా లోకంలో ఒళ్ళు జలదరించే సాహసాలెన్నో చేస్తుండే వాడు.

ఎవరెవరో ఇంటికి వచ్చి పోతుండేవారు. ఎన్నో గమ్మత్తయిన విషయాలు జరుగుతుండేవి. ఒకసారి దొమ్మరివాళ్ళు వచ్చారు. గడకర్రల సాయంతో నలభై మీటర్లకు మించిన ఎత్తుకు పైకి ఎగిరి చూపించారు. మరోసారి ఒకడు వచ్చి పందెం వేసి ఇరవై సేర్ల పచ్చి మాంసం తిన్నాడు. చిన్న పిల్లలకు ఇంతకు మించిన వినోదాలు ఇంకేం కావాలి!

# నాలుగు

అనుకోకుండా రవికి బయట ప్రపంచం చూసే అవకాశం కలిగింది. నగరంలో ఫ్లూ జ్వరం వ్యాపించింది. కుటుంబంలో కొందరిని పిల్లలతో సహా పల్లెకు తరలించాలని పెద్దలు నిర్ణయించారు. పల్లె పట్టున వాతావరణం నగరంలో కంటె బాగుంటుంది. రవికూడ పల్లెకు చేరుకొన్నారు.

వాళ్ళేమంత దూరం ప్రయాణం చేయలేదు. జొరాసంకొ నుంచి కొన్ని మైళ్ళు హుగ్లీ నది మీద ప్రయాణించేపి పెనేటి చేరుకొన్నారు. వాళ్ళ ఇల్లు తోటలో ఉండేది, చుట్టూ పళ్ళ చెట్లు, పూల మొక్కలు ఉండేవి. ఒక చెరువు, ఇంటికి దగ్గరగా నదీ తీరం ఉండేవి. ఇంతకంటె ఆనందప్రదమైన చోటు రవి ఊహించ లేదు. ఎన్నో సంవత్సరాల తర్వాత తన జ్ఞాపకాలు పుస్తక రూపంలో వ్రాస్తూ రవి ఇలా అన్నాడు. "ఆ ఇంట్లో గడిపిన ప్రతిరోజూ ఉదయాన బంగారు అంచులున్న ఉత్తరం అందుకొన్నట్లుండేది."

పిల్లలను ఇల్లు దటి వెళ్ళనిచ్చే వారు కాదు. ఎవరైనా అలా వెళ్ళ ప్రయత్నించినా పెద్దవాళ్ళు, "వెళ్ళండి, వెళ్ళండి. లోపలికి వెళ్ళండి బయట మీకేం పని" అనేవారు. కాకపోయినా పిల్లలకు బయటి కంటె కాంపౌండు లోపలే బాగుండేది.

పొద్దుటి పూట రాత్రి చేసిన పూరీలు తియ్యటి పాకంలో ముంచుకొని తినేవారు. రవికి ఇదెంతో రుచిగా ఉండేది. చుట్టూ పళ్ళ చెట్లు వుండేవి. వంకర టింకర మెట్లు మడుగులోకి దారి తీసేవి. పిల్లలు ఇక్కడే ఆడుకొనేవారు. కబుర్లు చెప్పు

కొనేవారు. ఇంటికి అవతలి వైపు అందమైన పెద్ద నది వుండేది. కొన్నిసార్లు పడవలు వరుసగా ఇంటి ప్రక్కగా పోయేవి. వాటి తెరచాపలు గాలికి రెప రెపలాడుతుండేవి. ఇన్నాళ్ళూ కలలుగన్న స్వేచ్ఛ తనకు లభించిందని రవి సంబర పడ్డాడు. తను దానికై పరుగులు పెట్టలేదు. అదే దానంతటదిగా వచ్చి పడింది.

కాని ఈ సంతోషం ఎన్నాళ్ళో లేదు. నగరంలో పరిస్థితులు బాగుపడ్డాయి. పిల్లలు తిరిగి బడికి వెళ్ళవలసి వచ్చింది. రవికి స్వేచ్ఛ అంటే ఏమిటో ఇప్పుడు అర్థమయింది. బడికి వెళ్ళటం మానేస్తే బొరొనంకా మంచి చోటే అనవచ్చు.

చందన్ నగరంలో ఉద్యాన గృహం



అక్కడ చేపలు పట్టే అబ్దుల్లా ఉన్నాడు. రవి అన్నగార్లకు హిల్సా చేపలు, తాబేళ్ళ గుడ్లు తెచ్చి పెడుతుండేవాడు. పెద్ద పులులను గురించి, మొసళ్ళను గురించి, తుఫాన్ల గురించి అతను ఎన్నెన్నో కథలు చెబుతుండేవాడు. అతని తల నున్నగా బోడిగా ఉండేది. గడ్డం ముందుకు పొడుచుకు వచ్చినట్లుండేది. రవి ఇహలోకంలోని సాహసయాత్రలన్నింటిలో అబ్దుల్లా తప్పకుండా ఉండేవాడు.

ఇంటి చుట్టూ ఉన్న నగరం కూడా బాగానే వుండేది. రవి మిద్దెపైకి వెళ్ళి మైళ్ళ కొద్ది పరచుకొని ఉన్న ఇంటికప్పులు చూస్తుండేవాడు. కొందరు ఊరగాయల జాడీలు ఎండలో పెడుతూ ఉతికిన బట్టలు ఆరేస్తూ వుండేవారు. అంతా ప్రశాంతంగా వుండేది. సామాన్యులు ఎలా జీవిస్తారో రవి ఇలాగే తెలుసుకొన్నాడు.

తన తండ్రి ఊళ్ళో లేనప్పుడు రవి సెలవు రోజుల్లో తండ్రి గదుల్లోకి వెళ్ళేవాడు. స్నానాల గదిలోకి వెళ్ళి షవరు తిప్పి స్నానం చేసేవాడు. ఆ రోజుల్లో కలకత్తాలో నీటి పంపులు కొత్తగా వచ్చాయి. వాన చినుకుల్లాంటి షవర్ బాత్ అపురూపమే అనవచ్చు. స్నానం చేశాక రవి నాన్నగారి పెద్ద కుర్చీలో కూర్చుని ఒక పెద్ద పుస్తకం చేతిలో పట్టుకుని చదివేవాడు.

సాయంకాలం పూట పూలు అమ్మేవాళ్ళు వచ్చేవారు. ఐస్‌క్రీం అమ్మేవాడు. తియ్యటి 'కుల్ఫీ' తెచ్చేవాడు. చిన్నాన్నగారింట్లో సంగీత సభలు, నాటకాలు జరిగేవి. ఒకసారి పక్కింట్లోనుంచి ఒకామె గోలుగోలున ఏడవటం వినిపించింది. రవికి ఏమీ కనిపించలేదు. ఆ తర్వాత తెలిసింది ఒక నాటకంలో తన బావగారు ఆడ వేషంలో చేసిన గోల అది.

ఇంట్లోని పిల్లలందరూ నేర్చుకొన్నట్లే రవి కూడా పాటలు పాడటం నేర్చుకొనేవాడు. అతనికి పాటలు పాడటం చాలా ఇష్టంగా ఉండేది. చక్కగా పాటలు పాడటం వచ్చేది. అతని అక్క కూతురు ప్రతిభకు పాశ్చాత్య సంగీతం బాగా తెలుసు. రవి ఆమె దగ్గర కొన్ని పాటలు నేర్చుకొన్నాడు. ఎన్నో భక్తి గీతాలు, శాస్త్రీయ సంగీతంలోని పాటలు ఎక్కడో చాటుగా విని నేర్చుకొనేవాడు. మొదట విష్ణు అనే సంగీత విద్వాంసుని వద్ద, తర్వాత ప్రముఖులైన జాదూ భట్టా దగ్గర

సంగీతం నేర్చుకొన్నాడు. కాని ఏదైనా చాలా కాలం నేర్చుకోవాలంటే రవికి గిట్టేదికాదు.

ఏ విషయంలోనైనా విసుగొస్తే, రవి మిద్దెపైకి వెళ్ళి నీలాకాశాన్ని చూస్తుండేవాడు. ఆకాశంలో నల్లటి మబ్బు, దూరంగా ఎగిరే గాలిపటం, అస్తమిస్తున్న సూర్యుని తోపాటు రంగులు మారే ఆకాశం, బాతులు తమ నెలపులకు ఎగిరిపోవటం.



సంగీతం మాష్టారు శ్రీకాంత సిన్హాతో రవీంద్రనాధ్, సోమేంద్రనాథ్, సత్య

ఇవన్నీ రవి చూస్తుండేవాడు. ఆదివారాల పూట ఇవి చూస్తుంటే చాలా బాధ కలిగేది. తెల్లవారితే బడికి పోవాలే అనే బాధ.

టాగూరు కుటుంబంలోని పిల్లలు సినిమాలు చూడటానికి గాని, ఆటల పోటీలకి గానీ వెళ్ళేవారు కారు. ఆ రోజుల్లో చిన్న పిల్లలు చూడదగ్గ సినిమాలు, ఆటలు ఏమంతగా ఉండేవి కావు. అందమైన గాజు గోళీలతో పిల్లలు ఆడుకొనేవారు. గాలి పటాలు ఎగరేసేవారు. ఒక్కొక్కసారి ముసలి ఎలుగు బంటిని పట్టుకుని ఎలుగు బంటి వాడు వచ్చేవాడు. ఎలుగు నాట్యం చేసేది. నిద్ర పోయినట్లు నటించేది. మేలుకొని వొళ్ళంతా కదిలించేది. పాములాడించేవాడు వచ్చేవాడు. వాని నాగ స్వరానికి పాములు ఇటూ, అటూ ఊగిసలాడుతుండేవి. ఇంద్రజాలికుడు కూడా వచ్చేవాడు. దూరం నుంచే అతని డప్పు వినిపించేది.

ఇంట్లో పండుగల సమయంలో అందరూ సరదాగా గడిపేవారు. బాజాలవాళ్ళు వచ్చేవారు. ఇంటిముంగలంతా పందిళ్ళు వేసేవారు. ఎవరెవరో వందల కొద్దీ చుట్టాలు వచ్చేవారు. వారికి విందులు జరిగేవి. సంగీత సభలు జరిగేవి. మత సంబంధమైన పండుగలు కూడా కొన్ని జరిగేవి. పెళ్ళిళ్ళు, అన్నప్రాసనలు, ఉప నయనాలు, బ్రహ్మ సమాజానికి సంబంధించిన పండుగలు మొదలైనవెన్నో ఉండేవి. వీటిలో బ్రహ్మసమాజ స్థాపనదినోత్సవానికి ఎక్కువ ప్రాముఖ్యం వుండేది. రవి తండ్రి రామమోహన్‌రాయ్ బ్రహ్మసమాజ అనుచరులు. విగ్రహారాధనలో ఆయనకు నమ్మకం లేదు. పాశ్చాత్య విద్యావిధానం మంచిదని, ఆడపిల్లలను కూడా చదివించాలని ఆయన భావించేవారు. రవి తండ్రి గారింట్లో మతసంబంధమైన కార్యాలన్నీ వేదాలపైనా, ఉపనిషత్తులపైనా ఆధారపడి ఉండేవి. కుటుంబసభ్యులు, స్నేహితులు ప్రత్యేకమైన పాటలు వ్రాసి పాడేవారు. శాస్త్రాలనుంచి ఏవి భాగాలు చదవాలో దేవేంద్రనాథ్ స్వయంగా ఎంపిక చేసేవారు. సంస్కృతాన్ని తప్పులు లేకుండా చదవటానికి వల్లెవేయటానికి ఇంట్లోని యువకులకు, చిన్న పిల్లలకు శిక్షణ లభించేది. ఉపనయనం జరిగాక రవి కూడ సంస్కృతం నేర్చుకొన్నాడు. ఆ భాష అంటే ఎంతో అభిమానం ఏర్పరచుకొన్నాడు.

పండుగ రోజుల్లో పిల్లలకు మరింత స్వేచ్ఛ ఉండేది. పండగ తయారీలు వీరెంతో ఆనందంగా చూసేవారు. పందిరి గుంజలకు త్రవ్వేగోతులను రవి కళ్ళప్పగించి చూసేవాడు. ఎక్కడయినా ధనరాసులు బయట పడుతాయని రవి ఆశ. కాని అలా ఎన్నడూ జరగలేదు.

# అయిదు

రవికి పన్నెండేళ్ళు వచ్చాయి. సోమేంద్ర, సత్యలతోపాటు రవి ఉపనయనం కూడా చేయాలని తండ్రి భావించారు.

ఈ ఏర్పాట్లన్నీ చేయటానికి దేవేంద్రనాథ్ తమ ప్రయాణాలు మానుకొని వెనక్కి వచ్చారు. ప్రతిదీ చక్కగా జరగాలని, ముఖ్యంగా విగ్రహాలు లేకుండా అన్ని తతంగాలూ ఏ కొరతా లేకుండా పూర్తికావాలని ఆయన సంకల్పం.

రవికి కాషాయవస్త్రాలు కట్టి, తల నున్నగా గొరిగి ఒక గదిలో కూర్చోబెట్టారు. ఈ సందర్భంలో చేసిన ప్రత్యేకమైన ఆహారం తిని గాయత్రి మంత్రం చెప్పవలసి వచ్చింది. రవికి ఇదంతా నచ్చింది. ముగ్గురు అబ్బాయిలూ ఒకరినొకరు బాగా వేళాకోళం చేసుకొన్నారు. రవికి మాత్రం ఒకే దిగులు పట్టుకొంది, ఈ బోడి గుండుతో బడికి ఎలాపోవాలా అని.

ఉపనయనం కాగానే తండ్రి రవిని పిలిపించారు. "కొన్నాళ్ళు నాతోపాటు ప్రయాణం చేస్తావా?"

రవి తన చెవులను తనే నమ్మలేకపోయాడు. కళ్ళు ఆనందంతో మెరిశాయి. అటువంటి ప్రశ్నకు ఒకే సమాధానం ఉంటుంది.

"కొన్నాళ్ళు శాంతి నికేతన్‌లో ఆగుదాం" అన్నారు తండ్రి. రవికి ఆనందం పొంగి పొరలింది. మొదటిసారిగా రైలు ప్రయాణం! శాంతి నికేతన్ సత్య చెప్పిన వింత మార్గం కళ్ళారా చూసే అవకాశం!

త్వరలోనే ప్రయాణం చేసే రోజు దగ్గర పడింది. మొదటిసారిగా రవికి పెద్ద

పిల్లలు వేసుకొనేలాంటి దుస్తులు కొత్తవి కుట్టించారు. మంచి బూట్లు కొన్నారు. జరీపని చేసిన మఖమల్ టోపి కూడా తెచ్చారు. ఈ టోపి పెట్టుకోవటం రవికి అసలు ఇష్టం లేదు. రైలు బండిలో కూర్చున్నప్పుడు టోపి తీసి పక్కన పెట్టు కొన్నాడు. అయితే ఏం లాభం

"నీ టోపి ఏది రవీ? పెట్టుకోమరి" అన్నారు తండ్రి. రవి టోపి తీసేసి నప్పుడల్లా ఇలాగే జరిగేది.

రైలుప్రయాణంలో సత్య చెప్పిన ప్రమాదమేదీ కనిపించలేదు. రైలులోకి

టాగూర్ తండ్రి కట్టించిన మొదటి ఇటికల మేడ



ఎక్కటం, దిగటం అంతా బాగానే ఉంది. బాల్‌పూర్ స్టేషన్ నుండి శాంతినికేతన్‌కు వీళ్ళు పల్లకీలో వెళ్ళారు.

శాంతినికేతన్ ఇల్లు చేరేసరికి సాయంకాలమయింది. దారి పొడవునా రవి కళ్ళు మూసుకొనే ఉన్నారు. తెల్లవారిన తర్వాత వెలుగులో అంతా బాగా చూడాలని అతని ఆశ. అలాగే జరిగింది. రవికి ఉదయం మెలకువ వచ్చేసరికి శాంతి నికేతన్ ఉదయపు ఎండలో మిలమిలలాడుతోంది.

సత్య చెప్పిన వింత మార్గం కోసం, దగ్గరలో ఉన్న వరి పొలాల కోసం రవి వెతికాడు. దగ్గరలో చెట్లక్రింద అన్నం వండుకొని రైతుల పిల్లలతో ఆడుకోవచ్చని కూడా సత్య చెప్పాడు. కాని ఇక్కడ అలా లేదు. పోతే చుట్టూ పరిసరాలు మరీ బాగున్నాయి. దూరంగా ఎటువైపు చూసినా పొలాలే పొలాలు. దూరంగా వంగిన నీలాకాశం, కళ్ళు మిరుమిట్లు గొలిపే సూర్యకాంతి, చల్లటి గాలి. పక్షుల కిలకిలలు.

రవి ఒక్కడే పొలాలలోకి వెళ్ళారు. ఎగుడు దిగుడుగా ఎర్రమట్టి గట్లున్నాయి. చెట్లు, అక్కడక్కడా బెమ్మజెముడు పొదలు — కొన్నిచోట్ల ఎర్ర మట్టి చిన్నచిన్న గుట్టలుగా ఉంది వాటిపై కొన్ని చీలికలు ఏర్పడ్డాయి. వాన నీళ్ళు కాలువల్లా ప్రవహించేవి. అక్కడక్కడా చిన్న నీటి గుంటలు, వాటిలో నిజమైన చిన్నిచిన్ని చేపలు. రవి ఆనందంతో గంతులు వేశాడు. చుట్టూ మెరుస్తూపడి ఉన్న గులక రాళ్ళు ఏరుకొన్నాడు.

అన్నిటి కంటే మించి, అంతగొప్పవారైన తన తండ్రి దగ్గర ఉండటం, రవికి ఎంతో ఆనందాన్ని కలిగించింది. తన తండ్రి విషయంలో అంత భయపడవలసింది ఏమీలేదని ఆయన ప్రేమించ తగ్గ వ్యక్తి అని గ్రహించాడు.

ఒక రోజు రవి ఎన్నో గులకరాళ్ళు పోగుచేసుకుని వచ్చి తండ్రికి ఇచ్చాడు. తండ్రి చాలా సంతోషించినట్లె కనిపించాడు. ''మరికొన్ని తీసుకొని రానా?'' అని రవి అడిగాడు.

"అలాగే. అన్నీ తెచ్చి నేను ప్రార్థన చేసే చిన్న గుట్టకు బాగా అలంకారం చెయ్యి." అన్నారు. ఆ చిన్న గుట్ట ఇప్పటికీ ఉంది.

"ఈ పిల్ల కాలువలోని నీళ్ళు మనమెందుకు త్రాగ కూడదు? స్నానానికి కూడా బాగుంటాయి. నీళ్ళు ఎండలో మిలమిలలాడు తున్నాయి కూడా" అన్నారు రవి. తండ్రి ఈ మాటలకు నవ్వలేదు.

టాగూర్ తండ్రి ధ్యానం చేసిన స్థలం. ఛాతిమ్ తాలా



కవిత్వం వ్రాయటానికి శాంతినికేతన్ చక్కటి స్థలమని రవి గుర్తించాడు. అక్కడ తోటలో ఒక చిన్న తాటి చెట్టు ఉండేది. రవి దానికి వీపు ఆనించి క్రింద కూర్చునేవాడు. కాళ్ళు ముందుకు చాపి పద్యాలు వ్రాసుకొనేవాడు. తన చిన్న పుస్తకం చిరిగి పోయిందని మరో క్రొత్త నోటు బుక్కు కొన్నాడు. కాగితం పెళపెళలాడుతుండేది. 'పృధ్వీరాజు ఓటమి' అనే పేరుతో పెద్ద కవిత వ్రాశాడు. కాని ఆ నోట్ బుక్కుతో పాటు ఈ కవిత కూడా ఎక్కడో పోయింది.

టాగూర్ తండ్రి శాంతినికేతన్‌లో కట్టించిన అద్దాల మందిరం



# ఆరు

రవి వయస్సుకు మించిన పొడవుతో బలంగా ఉండేవాడు. ఇంకా పన్నెండేళ్ళు దాటలేదు కనుక రవికి తండ్రి రైలులో అర టిక్కెట్టు కొన్నారు. టికెట్ కలెక్టరుకు అనుమానం కలిగింది. "ఏమండీ ఈ అబ్బాయికి పన్నెండేళ్ళు దాట లేదా?" అని అడిగాడు.

"లేదు" అన్నారు తండ్రి.

"నిజమే చెబుతున్నారా? చూడటానికి పెద్దగా కనిపిస్తున్నాడు."

తను మోసం చేసినట్లు టిక్కెట్ కలెక్టరు అనుకోవటంతో రవి తండ్రికి చాలా కోపం వచ్చింది. వెంటనే పూర్తి టిక్కెట్టు కొన్నారు. టిక్కెట్ కలెక్టరు మిగిలిన చిల్లర ఇస్తే దాన్ని ప్లాటు ఫారం మీదకు విసిరి పారేశారు. టికెట్ కలెక్టరు సిగ్గుతో వెళ్ళి పోయాడు. అంత నెమ్మదిగా ఉండే తన తండ్రికి అవసరమైతే ఎంతకోపం వస్తుందో రవి గుర్తించాడు.

అమృతసర్‌లో వాళ్ళు దర్బార్ సాహెబ్ దగ్గిర మకాం పెట్టారు. తరచుగా ఉదయం పూట రవి ఆ గుడికి వెళ్ళేవాడు. గుడి చాలా బాగుంటుంది. సిక్కులో నిల్చుని ప్రార్థనలు, కీర్తనలు వినేవాడు. తన తండ్రి కూడా వారితో పాటు ప్రార్థనలు చేసేవారు. సిక్కులు వీరి పట్ల చాలా స్నేహం భావం కనపరచేవారు. రవి హల్వా, కలకండ ప్రసాదం తెచ్చుకొనేవాడు.

"నీవు జోరాసంకోలో నేర్చుకొన్న పాటలు పాడు రవీ" అని తండ్రి

ఎప్పుడైనా అడిగేవారు. రవి తీయగా పాడుతుంటే ఆయన కళ్ళు మూసుకొని చేతులు జోడించి వినేవారు.

వాళ్ళు అమృతసర్‌లో పూర్తిగా ఒకనెల వున్నారు. రవికి పాఠాలు తప్పలేదు. వాళ్ళు ఎన్నో పుస్తకాలు కూడా తెచ్చుకున్నారు. ఇంగ్లీషు, బెంగాలీ, వ్యాకరణం, సంస్కృతం, ఖగోళ శాస్త్రం మొదలైనవెన్నో రవి తండ్రి దగ్గర నేర్చుకొనేవాడు. అయినా చుట్టూ ఉన్న వింతలన్నీ చూడటానికి కూడా కావలసినంత తీరిక వుండేది. తను శారీరకంగానే కాదు మానసికంగా కూడా వికాసం పొందుతున్నట్లు రవి గ్రహించాడు.

అమృతసర్ నుంచి వాళ్ళు డల్‌హౌసీ కొండ ప్రాంతం చేరుకొన్నారు. రవికి కొండలు చూడటం అదే మొదటిసారి. ఉదయం రొట్టె, పాలు తీసుకొన్న తర్వాత వీళ్ళు కొండపైకి వెళ్ళేవారు. నడిచికాదు, డోలీలలో. పండిన పొలాలను దాటుకొంటూ పైపైకి వెళుతున్నప్పుడు రవికి చాలా ఆశ్చర్యంగా వుండేది. పైకి వెళ్ళే కొద్ది బలమైన, పొడవైన చెట్లు కనిపించేవి. నీటి ధారల చప్పుడు వినిపించేది. మెరుస్తున్న పిల్ల కాలువలు పైనుంచి కిందకి జోరుగా పడుతుండేవి.

రాత్రిపూట వాళ్లు డాక్ బంగళాలో వుండేవారు. తండ్రి తన కుర్చీ వరండాలోకి లాక్కుని నక్షత్రాలు, గ్రహాలు కొడుక్కి చూపించి వాటిపేర్లు చెప్పేవారు. ఆకాశమంతా నక్షత్రాల మిణుకు మిణుకు మనేవి. పర్వత శిఖరాలు వింతగా కాన వచ్చేవి. మంచు, మేఘాలు రహస్యమయంగా కనిపించేవి.

వెలుగు రాకముందే తండ్రి నిద్ర లేచేవారు. కొంతసేపు ప్రార్థన చేసుకొనే వారు. ఆ తర్వాత తండ్రీ కొడుకులు వాహ్యాళికి వెళ్లేవారు. తిరిగి వచ్చాక తండ్రి దగ్గర రవి ఇంగ్లీషు నేర్చుకొనే వాడు. రవికి భాషలంటే మక్కువ ఏర్పడింది. త్వరలోనే బెంగాలీ, ఇంగ్లీషు, సంస్కృతం, మైథిలీ భాషలు నేర్చుకొన్నాడు. తన చేతి కందిన పుస్తకమల్లా చదివేవాడు. కొన్ని కొన్ని అర్థం కాకపోయినా మాటల శబ్దానికే రవి మురిసిపోయేవాడు.

వాళ్ళిద్దరూ సామాన్యమైన ఆహారం తీసుకొనేవారు. రవికి ఇష్టంలేక

పోయినా పాలు తాగవలసి వచ్చేది. నిద్రతో తూగుతుంటే తండ్రి రవిని విడిచిపెట్టే వారు. రవి నిద్ర పోవటానికి బదులు, ఇసుక పొన్ను ఉన్న కర్ర తీసుకొని ఒక్కడే దూరంగా నడుచుకొంటూ పోయేవారు. తండ్రి రవిని ఈ విషయమై ఎప్పుడూ కోప్పడలేదు. చిన్న పిల్లలు తమ కాళ్ళమీద తాము నిలబడాలని ఆయన భావించే వారు.

తండ్రికి రవి జోరాసంకో ఇంటిని గురించి ఎన్నెన్నో విషయాలు చెప్పారు. ఈ చిన్న చిన్న విషయాలు ఆయనకు ఎవరూ చెప్పలేదు. ఇవన్నీ వింటుంటే ఆయనకే వింతఅనిపించింది. ఇంటి నుంచి వచ్చిన ఉత్తరాలు తండ్రీ కొడుకు లిద్దరూ చదువుకొనేవారు. రవి ఇంతకు ముందు ఎప్పుడూ తన తండ్రికి ఇంత సన్నిహితం కాలేదు. ఆయన్ని అంత బాగా అర్థం చేసుకోలేదు.

కొన్ని నెలల తర్వాత రవి కిశోరీ బాబుతో కలకత్తాకు వచ్చేశాడు. తండ్రి ఆయన ప్రయాణాలు ఒంటరిగా సాగించారు.

ఈ కొద్ది నెలలలోనే రవిలో ఎంతో మార్పు వచ్చింది. పెద్దవాడయ్యాడు. ఇప్పుడు అందరూ రవి పట్ల శ్రద్ధ చూపించసాగారు. మునపటిలా "కుర్రాడులే" అనే భావం సమసిపోయింది.

ఇంట్లో ప్రతి ఒక్కరూ రవిలో వచ్చిన మార్పు గుర్తించారు. తిరిగి వచ్చిన కొత్తలో గది గదికీ వెళ్ళి రవి తన అనుభవాలు అందరికీ చెప్పేవాడు. రవి తల్లి ఎంతో మురిసిపోయేది. ఇంట్లో గుంపుగా కూర్చుని ఆడవాళ్ళందరూ రవి కబుర్లు ఆశ్చర్యంతో వినేవారు.

రవి తాను కొత్తగా సంపాదించుకొన్న తెలివి తేటలన్నీ వాళ్ళ ముందు ప్రదర్శించేవాడు. నక్షత్రాల గురించి చెప్పేవాడు. ఉపనిషత్తులో నుంచి కొన్ని శ్లోకాలు వినిపించేవాడు. అందరూ రవి చాలా గొప్పవాడనుకొన్నారు. నిజం చెప్పాలంటే రవికి కొంచెం గర్వం బలిసిందని చెప్పవచ్చు. రవి తల్లి మాత్రం సంతోషం పట్టలేకపోయింది. "రవి రామాయణ శ్లోకాలు వినిపిస్తాడు. రండి

రండి" అంటూ అందరినీ పిలిచేది. అప్పుడు రవికి కొంచెం వణకు పుట్టుకొచ్చేది. ఎందుకంటే ఆ శ్లోకాలు అంత బాగా గుర్తులేవాయె మరి!

తిరిగి బడికి వెళ్ళటమన్నది పెద్ద ఇబ్బందే అయింది. కాని పాత బడికి ఈసారి కాకుండా కొత్తదానికి పంపించారు. సెయింట్ జేవియర్ స్కూలు ఆ నగరంలో కల్లా మంచి బడిగా పేరు పొందింది. అయినా రవికి ఆ స్కూలు కూడా నచ్చలేదు.

రవి మరి కొన్ని పద్యాలు వ్రాశాడు. చిన్న తనంలో వ్రాసిన లాంటివి కాదు. 'అభిలాష' అనే పద్య మొకటి వ్రాశాడు. ఇది పెద్దవాళ్ళ పేపరులో అచ్చయింది. రవి సంతోషంగా గడిపిన రోజులు ఇకలేవు. కొన్నాళ్ళు జబ్బుచేసి రవి తల్లి మరణించింది. ఇల్లంతా దుఃఖంతో నిండిపోయింది. తల్లి పోయినప్పుడు రవికి పధ్నాలుగో ఏడు. తల్లికి యాభై సంవత్సరాలు కూడా లేవు.

ఆమె రాత్రిపూట మరణించింది. ప్రొద్దున్న పిల్లల్ని కిందకు వచ్చి ఆఖరు సారిగా ఆమెను చూడమన్నారు. ఆమెను మంచి పూలమాలలతో అలంకరించారు. తల్లికి దూరంగా ఉండటం రవికి అలవాటే. కాకపోయినా అన్నలూ, వదినలూ రవిని ఇప్పుడు మరింత ప్రేమగా చూసుకోసాగారు. రవి తండ్రి మాత్రం ఒంటరిగా చాలా సమయం ప్రార్థనలో, ధ్యానంలో గడపసాగారు.

తల్లి ఒక ప్రేమమూర్తిగా రవి జ్ఞాపకాల్లో మిగిలి పోయింది. తను ఏమి చెప్పినా వినేది. రవి విషయమై ఎంతో గర్వించేది. రవి సరిగ్గా పాఠాలు చదువు కోడని ఇంట్లో వాళ్ళు కోప్పడినా తల్లి మాత్రం రవి కబుర్లు విసుగులేకుండా వింటుండేది.

# ఏడు

రవి జీవితంలో కొత్త మలుపు తిరిగింది. రవికి ఇప్పుడు పధ్నాలుగేళ్లు. ఇటు చిన్న కుర్రాడూ కాదు, అటు పెద్దవాడూ కాదు. ఇప్పుడు బడికి పోవడం పూర్తిగా మానేశాడు. అయితే మేష్టర్లు ఇంటికి వచ్చి పాఠాలు చెప్పేవారు. చేతికి అందిన పుస్తకం, పత్రిక, పేపరు అన్నీ చదువుతుండే వారు రవి. ఈ విధంగా అతను ఎన్నో విషయాలు నేర్చుకొన్నారు. రవి సంస్కృతం చదివేవారు. పాత కాలపు బెంగాలీ పుస్తకాలు, వ్రాత ప్రతులు చదివేవారు. మైథిలీ భాష కూడా నేర్చుకొన్నారు. ఇందు పాత కాలపు పద్యాలు రవికి చాలా ఇష్టం. మైథిలీ బెంగాలీ కంటె పురాతనమైనది. ఈనాటి బెంగాలీ భాషకు మైథిలీకి కొంచెం తేడా కూడా ఉంది. రవికి త్వరలోనే ఈ భాష బాగా వచ్చేసింది.

తనతో పాటు తన ప్రతిభ కూడా పెరుగుతోందని రవి అనుకొన్నారు. కాని కొన్నాళ్ల తర్వాత ఆరోజుల గురించి రవి ఇలా అన్నారు : ''అప్పట్లో వ్రాసిన పద్యాలకు విలువేముంది ? వాటిలో లోతేముంది ?'' అవును మరి. అప్పటికి రవి చాలా చిన్నవాడు.

అప్పట్లో రవి చుట్టూ ఉన్నవాళ్ళంతా ప్రతిభావంతులే. అతని పెద్దన్నగారు పేరు పొందిన దార్శనికుడు. ఆయన కవిత్వం కూడా వ్రాసేవారు. అది అర్థమవటం కొంచెం కష్టంగానే ఉండేది. ఆయన తన కవిత్వం చదవటం మొదలు పెట్టగానే వినేవాళ్లు ఏదో ఒక వంకతో తప్పించుకొనే వారు, అందుకని ఆయన

ఒక్కోసారి తన పనివాడికి తన కవిత్వం వినిపించేవారు. పనివాడు బాగుందని తల ఊపేవారు. అప్పుడప్పుడూ "ఇదేమంత బాగలేదండీ" అనేవారు. రవి ద్విజేంద్రుడికి ఆఖరి తమ్ముడు. రవికి అన్నగారి కవిత్వం బాగా నచ్చింది కాని అలా వ్రాయటం కష్టమనిపించేది. తనకు తగిన పద్ధతి ఒకటి వెతుక్కోవలసి వచ్చింది.

ఆ రోజుల్లో ఇంట్లోని వాతావరణం ఉత్సాహంతో నిండి ఉండేది. భారత దేశానికి సంబంధించిన దేనినైనా పైకి తీసుకు రావాలనే ప్రయత్నం జరిగేది. నిత్యం ఇంట్లో వాళ్ళు తమ తమ పనుల్లో మునిగి ఉండేవారు. అప్పుడు సమాజంలో రెండు వర్గాల వారుండేవారు. మన పాత పద్ధతులేవీ మంచివి కావనీ, అన్ని విధాలా పాశ్చాత్యులను అనుకరించాలని కొందరు భావించే వారు. విదేశాలకు సంబంధించి నవి ఏవీ మంచివి కావనీ, మన పాత పద్ధతులనే పాటించాలని వాటిలో ఏమార్పు చేయరాదనీ మరి కొందరు భావించేవారు.

ఇప్పుడు మూడోవర్గం ముందుకు వచ్చింది. వీరు ఈ రెండు సాంప్రదాయాల కలయిక కోరుకొన్నారు. మన ప్రాచీన సంస్కృతిని నిలబెట్టుకోవాలి. సమాజంలో చెడుగులను బాగు చెయ్యాలి. పాశ్చాత్యుల నుంచి కొత్త విషయాలు నేర్చుకోవాలి. రాజా రామ మోహన్ రాయ్, టాగూర్లు, మరెందరో ఈ వర్గానికి చెందినవారు. రవి వీళ్ళ ప్రభావానికి లోనయ్యాడు. జాతీయ భావనను సమర్థించాడు.

వాళ్ళు రహస్య సమావేశాలు జరిపేవారు. దేశభక్తి గీతాలు, నాటకాలు వ్రాసేవారు. నేషనల్ థియేటరు స్థాపించారు. పైకి రావాలని ప్రయత్నిస్తున్న భారతీయ వ్యాపారానికి సాయం చేశారు. స్వదేశీ వస్తువుల కొట్టును తెరిచారు. భారతదేశంలో తయారయిన వస్తువులే కొనేవారు. ఆ రోజుల్లో దేశభక్తుల నందరినీ కలుసుకునే అవకాశం రవికి లభించింది.

దేవేంద్రనాథుని రెండో కొడుకు సత్యేంద్రనాథ్ భారతీయులు ఇంగ్లీషు వారితో పోటీ చేయగలరని మరోవిధంగా ఋజువు చేశాడు. ఇండియన్ సివిల్ సర్వీసులో నియమించబడిన మొదటి భారతీయు డితనే. ఆ రోజుల్లో గొప్పింటి ఆడవాళ్ళు పరదాలో ఉండేవారు. సత్యేంద్రనాథ్ భార్యే పరదా తీసివేసిన మొదటి కులీన స్త్రీ.

ఆమె పిల్లల కోసరం మంచి మంచి పుస్తకాలు వ్రాసింది. సత్యేంద్రనాథ్ ఠారా సంకో వదిలి, తన కుటుంబంతో ఒక అద్దె ఇంట్లో ఉండేవారు. రవి వీళ్ళింటికి తరచూ వెళుతుండేవారు. ఆ విధంగా ఎన్నో కొత్త విషయాలు నేర్చుకొన్నారు.

ప్రతి సంవత్సరమూ జాతీయవాదులు కలకత్తాలో పెద్ద తిరునాళలాంటిది ఏర్పాటు చేసేవారు. ఈ మేలాలో భారతీయ వస్తువులు, కళకు సంబంధించిన వస్తువులు ప్రదర్శించేవారు. భారత సంగీత సభలు, నాట్యప్రదర్శనలు, నాటకాలు ఏర్పాటు చేసేవారు. జాతీయతకు సంబంధించిన ఉపన్యాసాలు ఇచ్చేవారు. దేశభక్తి గేయాలు కొత్త కొత్తవి పాడేవారు. ఈ మేలాలో రవి మొదటిసారిగా తన దేశ భక్తి గేయాన్ని వినిపించారు. అప్పుడు రవికి పదిహేనేళ్లు.

రవి కవితను వందల కొద్దీ ప్రజలు విన్నారు. చాలా మెచ్చుకున్నారు. కాని ఆ అబ్బాయి పేరు వాళ్ళకు తెలీదు. ఆ పద్యం ఒక పత్రికలో అచ్చయింది. దానిలో కూడ రవి పేరు లేదు. తన దేశానికి తాను చేయగలిగిందేదో ఉందని రవి గుర్తించారు. రపని విమర్శించే వ్యక్తి ఒకరున్నారు. ఆ వ్యక్తి మరెవరో కాదు. రవి పెద్దన్న జ్యోతిరీంద్రుని భార్య. కాదంబరీదేవి. ఆమె రవి కంటె వయసులో కొంచెం పెద్దది. ఎన్నో పుస్తకాలు, పత్రికలు చదివింది. కవి బిహారీ లాల్ చక్రవర్తి అంటే ఆమెకు ఎంతో అభిమానం. "నీవెన్నటికీ బిహారీ బాబులా కవిత్వం వ్రాయలేవుగాక వ్రాయలేవు" అంటూ రవిని విమర్శించేది. రవికి ఎంతో విచారం కలిగినా దానితోపాటు ఇంకా బాగా వ్రాయాలనే పట్టుదల కూడా పెరిగింది.

నిజానికి రవికి, ఆ వదినకు చాలా స్నేహం ఉండేది. రవికి ఆమె ఎన్నో విధాల సహాయం చేసింది. ఆమె వల్లనే రవి బిహారీ లాల్ వంటి వారి గొప్ప కవుల రచనలు చదివారు. తల్లిలేని రవికి వదినగారి దగ్గిర ఆ కొరత తీరింది. జ్యోతిరీంద్ర మేడపైన ఉండేవారు. అక్కడ ఒక బాల్కనీ ఉండేది. అతని భార్య అక్కడ ఎన్నో మొక్కలు పెంచింది. సాయంకాలాలలో ఎవరెవరోవచ్చి పుస్తకాలు, సంగీతం, రాజకీయాలు మొదలైన వాటిని గురించి మాట్లాడేవారు.

కొన్ని సార్లు అక్కడ పాటలు కూడా పాడేవారు. రవికి శ్రావ్యమైన కంఠం ఉంది. పదిమందీ అతని పాటను మెచ్చుకొనే వారు.

జోరాసంకోకు బయటి వాళ్ళు ఎప్పుడూ వస్తూనే ఉండేవారు. కానీ పూర్వం ఇంటి ఆడవాళ్ళు ఈ చర్చలకు దూరంగా ఉండేవారు. అసలు పదిమందిలోకి వచ్చి ఎరుగరు. ఇప్పుడు కాలం మారింది. ద్విజేంద్రనాథుని కూతురు స్కూలుకు వెళ్ళేది. సత్యేంద్రనాథుని భార్యా, పిల్లలు ఇంగ్లాండుకు వెళ్ళారు. టాగూర్ల కుటుంబంలోని స్త్రీలు ఇప్పుడు తమ ఘోషా వదిలి పెట్టారు. కొంతమంది గుర్రపు స్వారి కూడా నేర్చుకొన్నారు.

జ్యోతిరీంద్రనాథ్ ఒక పియానో కొన్నారు. దాని మీద పాశ్చాత్య సంగీతం వినిపించేవారు. ఈ ధ్వనులు, రాగాలు రవికి అలవాటవగానే వాటికి తగిన మాటలు చేకూర్చసాగాడు. జ్యోతిరీంద్రునికి ఇదెంతో సంతోషాన్ని కలుగజేసింది. అన్నదమ్ములిద్దరూ సంగీతసాధనలో కొన్ని గంటలు గడిపేవారు. రవికి ఇదెంతో నచ్చింది. అతనికి తగిన ప్రోత్సాహం కూడా లభించింది.

తమ చిన్నాన్నగారి ఇంట్లో వేసే నాటకాలు తన అన్న వ్రాస్తే, రవి వాటికి అవసరమైన పాటలు వ్రాసేవాడు. అందరూ ఈ విషయంలో రవిని పొగిడినా, రవి పరీక్షలు పాసయి మంచి ఉద్యోగం సంపాదించాలని కోరుకునేవారు. "రవికి పదిహేనేళ్లు వచ్చాయి. ఇకనైనా జీవితంలో ధ్యేయం ఉండాలి" అనేవారు. పద్యాలు, పాటలు, వ్యాసాలు, కథలు వ్రాయటంతో సరిపోదు. అదీగాక రవిది చదువుకోవలసిన వయసు.

నిజానికి రవి చాలా చదివేవాడు. కాని బడి పాఠాలు, మాస్టర్ల పాఠాలు మటుకు కాదు. పాత మైథిలీ పద్యాల సంకలనం ఒకటి దొరికింది. దాన్ని పూర్తిగా చదివేశాడు. ఒకరోజు వాన కురుస్తోంది. ఆ మధ్యాహ్నం తన పరుపు మీద బోర్లా పడుకొని పలకపై పాత మైథిలీ కవుల ధోరణిలో ఒక చరణం వ్రాశాడు. రవికి ఇది ఎంతో ఆనందం కలుగ జేసింది.

కొన్నాళ్ళ తర్వాత రవి తన పాత స్నేహితుణ్ణి ఒకణ్ణి కలుసుకొని ఇలా చెప్పారు. "నేను బ్రహ్మ సమాజ్ లైబ్రరీలో పుస్తకాల కోసం వెతుకుతూ ఉంటే పాత వ్రాత ప్రతి ఒకటి దొరికింది. చెదలు చాలా వరకు కొట్టేశాయనుకో. అది ఎవరిదను కొన్నావు? అందరూ ఇంచు మించుగా మరచిపోయినా భానుసింహుడనే మైథిలీ కవిది. ఇదిగో కొన్ని పద్యాలు నేను కాపీ చేసుకొని వచ్చాను. "అంటూ రవి పద్యాలు చదివి వినిపించారు. అతని మిత్రుడు చాలా ఆశ్చర్యపోయాడు. "ఎంత బాగున్నాయి! విద్యాపతి పద్యాల కన్నా, చండీదేవ్ పద్యాల కన్నా బాగున్నాయి. వాటిని ఇలా ఇవ్వు. అక్షయ బాబు సంతోషంగా ఈ పాత పద్యాలను పుస్తకంగా అచ్చువేయిస్తారు."

రవి ఇరకాటంలో పడ్డారు. నెమ్మదిగా అసలు విషయం బయట పెట్టారు. "నిజానికి ఈ పద్యాలన్నీ నేనే వ్రాశాను. ఇదిగో చిత్తు కాపీలు కూడా ఉన్నాయి చూడు." ఈ నిజం ఆ మిత్రుణ్ణి మరింత ఆశ్చర్యంలో ముంచింది. ఆ తర్వాత ఈ పద్యాలు భారతి అనే మాసపత్రికలో అచ్చు అయ్యాయి. కవి పేరు భానుసింహుడు! పాఠకులకు ఈ పద్యాలు బాగా నచ్చాయి. పురాతన కవి భానుసింహుని ఎంతగానో మెచ్చుకొన్నారు. ఇంట్లోని వాళ్ళకు, దగ్గరి స్నేహితులకు మాత్రమే తెలుసు ఈ పద్యాలను రవీంద్రనాథ్ టాగూర్ అనే పదిహేనేళ్ల కుర్రాడు వ్రాశాడని.

నిజానికి 'భారతి' ఒక కుటుంబ పత్రిక. దానిని ప్రచురించేది జ్యోతిరీంద్ర. సంపాదకుడు ద్విజేంద్రనాథ్. రవి ఈ పత్రికకు వ్యాసాలు, పద్యాలు వ్రాస్తుండే వారు. ఈ పత్రికలో మొదటి సారిగా "కవి-కాహిని" అనే పెద్ద పద్యం ప్రచురిత మయింది. ఆ తర్వాత అది పుస్తకంగా కూడా వచ్చింది. ఇది రవి వ్రాసిన మొదటి పుస్తకం. తను పెద్ద వాడయ్యాక ఈ చిన్న వయసులో తను వ్రాసిన ఆ పద్యాలను, వ్యాసాలు పటిష్ఠంగా లేవని విమర్శించారు రవి.

రవి కాలం వ్యర్థంగా గడిపేస్తున్నాడని అతని బంధువులందరూ అంటూఉండగా,

రవి తను ఏం చెయ్యాలో ఇప్పటికే నిర్ణయించుకొన్నాడు. తను రచనలు సాగిస్తాడు. ఆ రచన తనలో ఉంది. అంతేకాక ఒక స్కూలు కూడా ప్రారంభించాలి. తన స్వంత పాఠశాల. అయితే అందుకై రవి చాలా సంవత్సరాలు వేచి ఉండాల్సి వచ్చింది.

# ఎనిమిది

రవిని అతని అన్నలు, అక్కలు పెంచారు. రవి తల్లి చనిపోగానే, పెద్దక్కయ్య సౌదామినీదేవి తల్లి స్థానం ఆక్రమించింది. తండ్రి బాగోగులు చూసుకొనేది. ఇంటి వ్యవహారాలు చూసేది. ఇంకో అక్క, స్వర్ణకుమారీ దేవికి సాహిత్యం పట్ల శ్రద్ధ ఉండేది. ఆమె పద్యాలు, కథలు వ్రాసేది. ఆ తర్వాత 'బాలక్' అనే చిన్న పిల్లల పత్రికకు సంపాదకత్వం కూడా వహించింది. రవి ఈ పత్రికకు వ్రాస్తుండేవాడు. క్రమంగా రవికి ఆత్మవిశ్వాసం చేకూరింది.

అక్కలు, అన్నలు అందరిలోకి జ్యోతిరీంద్రుని ప్రభావం రవిపై బాగా ఉండేది. రవి కంటె ఆయన పన్నెండేళ్లు పెద్ద. అయినా రవిని బాగా అర్థం చేసుకొన్నాడు. రవి సంగీతాన్ని ప్రోత్సహించాడు. రవి వ్రాసిన పాటలు నాటకాలలో పాడించేవాడు. ఎన్నో విషయాలలో రవి అభిప్రాయం కనుక్కొనేవాడు. రవి కూడా అన్నగారు ఏమని చెప్పినా సంతోషంగా చేసేవాడు.

జ్యోతిరీంద్రకు పాటలు, నాటకాలే కాక, గుర్రపు స్వారి, వేట, చేపలు పట్టటం లాంటి సరదాలు ఉండేవి. రవికి కూడా అవంటే ఇష్టమని తనవెంట తీసుకుపోయేవాడు. కాని రవికి జంతువులను చంపే వేట ఏమాత్రం ఇష్టముండేది కాదు. జంతువులను కట్టివేయడం, పక్షులను పంజరాల్లో పెట్టడం వాటి స్వేచ్ఛను అడ్డుకోవటమేనని రవి భావించేవాడు. ఒకసారి రవి కాదంబరీదేవి పెంచు కొంటున్న రెండు ఉడతలను విడిచి పెట్టేశాడు. ఆమెకు రవి చేసిన పని ఏమాత్రం నచ్చలేదు.

తూర్పు బెంగాలులో ఉన్న తమ ఆస్తి పాస్తులు చూసుకోటానికి జ్యోతిరింద్ర అప్పుడప్పుడూ వెళ్ళేవారు. ఒకసారి రవిని కూడా వెంటపెట్టుకు వెళ్ళారు. గోరాయ్ నది గట్టున శిలైదహాలో తమ పాత ఇంట్లో వీళ్ళు విడిది చేశారు. గోరాయ్ నది నీళ్ళ ఊరికి దగ్గరలోనే పద్మ నదితో కలిసేది. ఒకప్పుడు నీలి మందు తోటల ఇంగ్లీషు యజమానులు ఈ ఆస్తులకు స్వొంతదార్లుగా ఉండేవారు. పాడు బడ్డ నీలి మందు ఫ్యాక్టరీ ఒకటి ఇంకా ఉండేది. అక్కడ పొడవైన దేవదారు చెట్లుండేవి. గాలి వీచినప్పుడల్లా ఇవి నిట్టూర్పిన శబ్దాలు చేసేవి.

ఈ ప్రదేశంలో దయ్యాలు ఉన్నాయని పల్లెటూరి వాళ్ళు అనుకొనే వారు. రవికి ఈ చోటు బాగా నచ్చింది. విశాలమైన డాబాకి అనుకుని వున్న చిన్న గది ఒకటి రవికి కేటాయించారు. రవికి కవితలు అల్లటానికి కావలసినంత తీరుబడి లభించింది.

ఒకసారి జ్యోతి దాదా దగ్గరకు వెళ్ళి "తోటలో పూలు పిండి ఆ రసం సిరాగా వాడుకోనా ? రంగు రంగుల పద్యాలు వ్రాసుకొంటాను," అన్నాడు.

"అలాగే ఇంకా ఏమైనా కావాలంటే అడుగు."

రవి గుర్రపు స్వారికి చిన్న గుర్రం ఒకటి ఏర్పాటయింది. అదేమంత నెమ్మదయిన జంతువు కాదు. ఊరి బయటకు స్వారి చేస్తూ రవి వెళ్ళేవాడు. పడి పోకుండా దాని మెడ గట్టిగా కరచుకొన్నాడు. తర్వాత తన చిన్న పుస్తకంలో ఇలా వ్రాసుకొన్నాడు. "జ్యోతి దాదా నేను పడిపోనని నమ్మాడు. అందుకే నేను పడిపోలేదు."

ఒకరోజు షికారి విశ్వనాథ్ బలే వార్త తెచ్చాడు. "బాబుగారూ శిలైదాహ అడవిలో ఒక పులి ఉంది." జ్యోతి దాదా వెంటనే తుపాకి పట్టుకొని తయారయ్యాడు. "నీవు కూడా రా రవీ. ఆ పులిని కాల్చి వద్దాం" అనగానే రవికి చాలా ఆశ్చర్యమూ, ఎంతో సంతోషమూ కలిగాయి.

అడవి బాగా దట్టంగా ఉంది. వేటగాళ్ళు కూర్చోటానికి అనువుగా ఎత్తయిన



జ్యోతిరీంద్రనాథ్ టాగూర్

మంచె ఏదీ లేదు. పులిని కాలిస్తే ఎదురుగా నిలబడే కాల్చాలని విశ్వనాథ్ అభిమతం. అయితే వెదుర్లలో చిన్న చిన్న గూళ్ళలా చేశారు. కాళ్ళకు చెప్పులు లేనందుకు పీటిని ఎక్కడం రవికి మరీ సులభమయింది.

ఇప్పుడు వాళ్ళు చుట్టూ కలయచూశారు. దగ్గర పొదలో పసుపు పచ్చగా, నల్లగీతలతో ఆకారమేదో కనిపించగానే జ్యోతిరీంద్ర కాల్చారు. గుండు పులికి వెన్నులో తగిలింది. అది గర్జించింది, మూలిగింది, చుట్టూ పొదలను పంజాలతో తడిమింది. గిల గిల లాడి చచ్చిపోయింది. రవి ఇదంతా చూస్తున్నారు. చచ్చిపోయే ముందు పులి చాలాసేపు తన్నుకులాడిందని రవికి అనిపించింది.

మరోసారి ఏనుగెక్కి రవి పులి వేటకు బయలుదేరారు. ఆ రోజుల్లో ధనవంతుల దగ్గర ఏనుగులుండేవి. ఏనుగు నెమ్మదిగా నడిచింది, అక్కడక్కడా చెరకు విరిచి నములుతూ ముందుకు పోయింది. చివరకు అడవి చేరుకొన్నారు.

పులులు ఏనుగుల మీద ఎలా పడుతాయో, ఏనుగులు చెట్టు చేమలు విరిచేస్తూ, తమ పైనున్న వాళ్ళను కింద పడేసి ఎలా పరుగెత్తుతాయో రవి విన్నారు. రవికి ఇప్పుడు కొంచెం భయమేసింది.

హఠాత్తుగా ఏనుగు నిలిచిపోయింది. దాన్ని ముందుకు నడపించటానికి మావటి ఏమాత్రం ప్రయత్నించలేదు. అప్పుడు పొదల్లో నుంచి పులి మెరుపులా దూసుకుపోయింది. పట్టపగలు బాహాటంగా పచ్చిక బయళ్ళలో అది పరుగెత్తుతోంది. దానిని ఎవరూ కాల్చలేదు. దాని అందాన్ని, హుందాతనాన్ని చూస్తూ ఉండిపోయారు. ఇలా రక్తం చిందని పులివేట అంటే రవికి ఇష్టం. కొన్నాళ్ళ తరువాత వీళ్ళు జోరా సంకోకు తిరిగి వెళ్లిపోయారు.

హుగ్లీ నది తీరంలో ఒక తోట ఇంటిని జ్యోతి దాదా అప్పుడప్పుడు అద్దెకు తీసుకొనేవారు. రవి కూడా కొన్నాళ్ళు అక్కడ గడిపేవారు. రవికి పదహారేళ్ల వయసు. ఇప్పటికే ఎన్నో పద్యాలు వ్రాశారు. ఒకసారి బాగా వానకురిసినప్పుడు ఈదురు గాలిలో చెట్ల తలలు ఊగటం రవి గమనించారు. రేవు దగ్గర మెట్లకు

అలలు కొట్టు కొంటున్నాయి. చేపలు పట్టే చిన్న చిన్న పడవలు తెరచాపలు ఎత్తి ముందుకు సాగుతున్నాయి. విద్యాపతి వానను గురించి వ్రాసిన పాటలోని రెండు చరణాలు రవికి గుర్తువచ్చాయి. విద్యాపతి పురాతన మైథిలీ కవి. రవి ఆ పాత పాటకు రాగం కట్టాడు. "దానికి రాగం కట్టి ఆ పాటను నా స్వంతం చేసుకొన్నాను." అని రవి ఆ తర్వాత ఒకసారి అన్నాడు.

జ్యోతి దాదా డాబా మీద పిరగా ఉన్న చోట పొద్దుటి పూట కాఫీ తాగేవారు. రవి చిన్నతనంలో ఎన్నో గంటలు ఈ మిద్దెపైనే గడిచాయి.

జ్యోతి దాదా ఎన్నో నాటకాలు వ్రాశాడు. అవి వాళ్ళ చిన్నాన్న గారింట్లోనో, తమ ఇంటి ముందో వేసేవారు. కొత్తగా వ్రాసిన నాటకమేదైనా ఉంటే రవికి వినిపించటానికి రవిని మిద్దెపైకి పిలిపించేవారు. నాటకం ఎలా ఉందని కూడ రవిని అడిగేవారు. ఒక్కొసారి నాటకానికి పాటలు వ్రాయమనేవారు. రవికి అప్పుడు ఎంతో సంతోషం కలిగేది. ఈ నాటకాలు వేస్తే ఈ రోజుల్లో కూడా ఆ పాటలే పాడుతారు. అంత చిన్న కుర్రాడు ఈ పాటలు వ్రాశాడంటే నమ్మశక్యం కాదు.

'భారతి' పత్రికకు రవి వ్యాసాలు కూడా వ్రాసేవారు. పేరెన్నికగన్న రచయితల రచనలలోని తప్పొప్పులు పేర్కొనేవారు. ఇప్పుడెవరైనా ఆ వ్యాసాలు చదివితే వ్యాసకర్త చాలా చిన్నవాడని, అనుభవం లేనివాడని, కాని చాలా తెలివైన వాడని గ్రహిస్తారు.

పదహారేళ్ల వయస్సులో రవి భవిష్యత్తుగల మంచి రచయిత, కవి మాత్రమే కాదు. పొడవుగా బలంగా ఉండే యువకుడు కూడా. అందులో ఏమాత్రం సందేహం లేదు. రవి పెద్దవాడవుతున్నాడు. అతని అన్నలు, అక్కలు కూడ ఈ విషయం గుర్తించారు.

అతని పెద్దన్న, జ్యోతిరీంద్రనాథ్ కవి, దార్శనికుడే కాక గొప్ప ఈతగాడు. రవిని ఈత విషయంలో ఈయన ప్రోత్సహించారు. రవి త్వరలోనే ఈత బాగా

నేర్చుకొన్నారు. పెద్దవారైన తర్వాత శిలైదాహ్ దగ్గిర పద్మ నదిని కూడ ఈదుకొని అవతలిగట్టు చేరుకొన్నారు.

కవులు సన్నగా, బక్కగా, నాజూగా ఉంటారని చాలామంది భావిస్తారు. కానీ రవి పొడుగ్గా, బలంగా ఉండేవాడు. అతని తెలివి తేటలు కూడా గొప్పగా ఉండేవి.

# తొమ్మిది

రవి తనలోని శక్తులు గుర్తించాడు. కాని పెరుగుతున్న రవిని చూసి అతని అన్నలు, అక్కలు అతని భవిష్యత్తు గురించి ఆందోళన పడసాగారు. ఇంచు మించు పదిహేనేళ్ల కుర్రాడు ఏపుగా పెరుగుతూ ఇంట్లో ఇక్కడా అక్కడా కూర్చుని పాటలు పద్యాలు వ్రాస్తూ ఎన్నాళ్ళని గడుపుతాడు. ఏదో ఉపయోగకరమైన పని మొదలు పెట్టాలిగాని.

దేవేంద్రనాథుడి రెండో కొడుకు సత్యేంద్రనాథ్ రవిని ఇంగ్లాండుకు పంపమని తండ్రిని కోరాడు. సత్యేంద్రుని భార్య, పిల్లలు అప్పుడు ఇంగ్లాండులో ఉన్నారు. కాబట్టి రవి ఒంటరిగా ఉండనక్కర లేదు. కొన్నాళ్ళు వీళ్ళతో ఉండి ఇంగ్లీషు పద్ధతులూ, అవీ నేర్చుకోవచ్చు.

లండన్ యూనివర్సిటీ నుంచి మెట్రిక్యులేషన్ చదివి ఆ తర్వాత న్యాయశాస్త్రం చదవవచ్చు. రవి తప్పక మంచి బారిష్టరు అవుతాడు. చూడటానికి బాగుంటాడు. మాటలు నేర్చిన వాడు. తప్పితే ఇంగ్లీషు మరింత బాగా చదివి ధారాళంగా మాట్లాడాలి. ఇంగ్లీషు సమాజంలో నవనాగరికంగా ఉండేవాళ్ళు ఎలా ఉండాలో కూడా రవి నేర్చుకోవాలి.

జొరాసంకో ఇంట్లో ఇవన్నీ నేర్చుకోవటానికి రవికి సాధ్యంకాదు. కాబట్టి కొన్నాళ్ళు అహమ్మదాబాదులో ఉండి కొంచెం నాగరికంగా తయారయితే బాగుంటుందని నిర్ణయించారు. సత్యేంద్రనాథ్ అప్పుడు అహమ్మదాబాదులో జడ్జిగా ఉండేవాడు. ఊళ్లోని

పెద్దపెద్ద కుటుంబాల వాళ్లు అతని ఇంటికి వస్తూండేవారు. సత్యేంద్రనాథ్ దగ్గిర మంచి మంచి ఇంగ్లీషు పుస్తకాలు ఉండేవి. రవి అతని లైబ్రరీలో కొంచెంసేపు గడిపా డంటే ఇంగ్లీషు బాగా నేర్చుకోవటం ఖాయం. ఆ తర్వాత కొన్నాళ్ళు బొంబాయిలో స్నేహితుల ఇండ్లలో ఉండి ఇంగ్లీషు పద్ధతులు నేర్చుకోవచ్చు.

రవి చాలా సంతోష పడ్డాడు. క్రొత్త ప్రదేశాలు చూడటమన్నా, కొత్త విషయాలు నేర్చుకోవటమన్నా రవికి చాలా ఇష్టం. జోరాసంకో అంటే చాలా అభి మానం ఉంది, కానీ కొన్నాళ్ళు ఆ ఇంటికి దూరంగావున్నా ఫరవాలేదనిపించింది.

అహమ్మదాబాదులో జడ్జిగారి ఇల్లు రవి అనుకొన్న దానికంటే ఎంతో బాగుంది. దాన్ని షాహిబాగ్ ఇల్లని అనేవారు. ముస్లింల పరిపాలనలో పాదుషాలు ఆ ఇంటిని కట్టారట. దానిలో పెద్దపెద్ద మిద్దెలు వున్నాయి. అక్కడినుంచి సబర్మతి నది కనిపిస్తుంది. ఇసుకతీరాలపై బేగంల స్నాన గృహాలు ఉండేవి. అవి ఇప్పుడు కూలిపోయాయి. ఆ ప్రదేశం రవికి చాలా నచ్చింది. అక్కడ పెద్దపెద్ద గదులుండేవి. సత్యేంద్రనాథ్ కోర్టుకు వెళ్ళినప్పుడు అంత పెద్ద ఇంట్లో రవి ఒక్కడే ఉండేవాడు. కొందరు పనివాళ్ళుకూడా ఉండేవారు.

రవి ఒక గదినుంచి మరోగదిలోకి వెళుతూ వెనుకటి రోజుల్లో ఎంతెంత గొప్పవాళ్ళు ఆ ఇంట్లో ఉండేవారో ఊహించుకునేవాడు. ఇగ్లీషు పుస్తకాలు చదివేవాడు. డిక్షనరీల సాహయంతో కొన్ని పుస్తకాలు పూర్తిగా అర్థం చేసుకునేవాడు. కొన్ని పుస్తకాలు పదాలు పూర్తి అర్థం కాకపోయినా చదివేవాడు. పదాల శబ్దాలకే పులకరించేవాడు. తనకా అర్థంకాని పదాలున్న పుస్తకాలు చదవటమంటే రవికి సరదాగా ఉండేది.

రాత్రిపూట పై గదిలో ఒక్కడే పడుకొనేవాడు. తెరచిన కిటికీలోంచి వీచే గాలి సంగీతం పాడుతున్నట్లుండేది. గదిలో కందిరీగల పుట్టకూడా ఉండేది. కొన్నిసార్లు కందిరీగలు రవిని కుట్టాయి కూడా.

తను ఓ కొత్త జీవితం ప్రారంభించాలని రవి గ్రహించాడు. జీవితం ఇక



పదిహేడేళ్ళ వయసులో రవీంద్రనాథ్

మునపటిలా వుండదు. అతను ఎన్నో పుస్తకాలు చదివేవాడు. ఎంతో ఆలోచించే వాడు. కిటికీలో నుంచి బయటికి చూస్తు కూర్చునేవాడు. రాత్రిళ్ల ఒంటరిగా మిద్దెపై తిరిగేవాడు. మొదటిసారిగా రాగయుక్తమైన పాట ఇక్కడే వ్రాశాడు. అంతకు క్రితం జ్యోతిరీంద్రనాథ్ పియానోమీద వాయించిన పాశ్చాత్య రాగాలకు అనువుగా పాటలు వ్రాసేవాడు. ఇతరులు వ్రాసిన పాటలకు రాగాలూ కట్టాడు. ఇప్పుడు తనపాటకు తనే రాగం కట్టాడు. ఇక్కడ గడిపిన కొన్ని నెలలు రవి జీవితంలోనే కొత్త మలుపు తీసుకువచ్చింది. రవి హృదయంలో ఈ రోజులు చెరగని ముద్ర వేసుకొన్నాయి. ఎన్నో సంవత్సరాల తర్వాత ఈ ఇంటికి జ్ఞాపకాలతో "ఆకలి

చెన్న రాళ్ళు" అనే కథ వ్రాశాడు. ఆ ఇంట్లో రవి వ్రాసిన పాటలు ఈనాడు కూడా ప్రచారంలో ఉన్నాయి.

రవికి షాహిబాగ్ ఇంట్లో బాగానే ఉండేది. కాని ఇంగ్లీషువాళ్ళ పద్ధతులు నేర్చుకోవటానికి రవికి త్వరలోనే బొంబాయి వెళ్ళవలసి వచ్చింది. బొంబాయిలో కూడా రవికి బాగా గడిచిపోయింది. తాను ఉన్న ఇంటివాళ్ళు నవనాగరికులేకాక చాలా మంచివాళ్ళుకూడా. వాళ్ళింట్లో ఒక అమ్మాయి ఉండేది. ఆమెనుంచి రవి ఎన్నో విషయాలు నేర్చుకున్నాడు. ఆ అమ్మాయి రవికి ఎప్పుడూ గుర్తుండేది. ఆమెమీద అభిమానంతో అతను ఎన్నో పద్యాలుకూడా వ్రాశాడు. కాని ఆమె చిన్న వయస్సులోనే చనిపోయింది.

అహమ్మదాబాదులో, బొంబాయిలో ఆరు నెలలు గడిపిన తర్వాత ఇక ఇంగ్లాండుకు పోవటానికి రవి తయారుగా ఉన్నాడని పెద్దవాళ్ళు నిశ్చయించారు. రవి తన అనుభవాలను, జ్ఞాపకాలను పెద్దపెద్ద ఉత్తరాలలో వ్రాసేవాడు.

ఈ ఉత్తరాలన్నీ చాలావరకు పుస్తకంగా వెలువడ్డాయి. దీనిలో రవి అన్నీ వివరంగా వర్ణించాడు. పూనా అనే పొగ ఓడలో రవి ప్రయాణం చేశాడు. ఈ ఓడ సెప్టెంబరు 20వ తేదీ, 1878వ సంవత్సరం సాయంత్రం ఐదుగంటలకు బొంబాయి తీరాన్నుంచి ప్రయాణమయింది. ఒక్కడే డెక్ మీద నిల్చుని ఓడ తీరానికి దూరం కావటం చూశాడు.

హఠత్తుగా రవికి దుఃఖం ముంచుకొచ్చింది. తను భారతదేశ తీరాన్నేకాదు వితానికి తన బాల్యాన్ని కూడా విడిచిపెట్టి వెళ్ళుతున్నట్లు భావించాడు. డెక్ మీదనుంచి కిందకు వెళ్ళి రవి తన కేబిన్‌లో పడుకొన్నాడు.

# పది

రవీంద్రనాథ్ టాగూర్ బాల్యానికి సంబంధించిన కథ ఇక్కడితో సమాప్తమవుతుంది. పెద్దెనిమిది నెలల తర్వాత రవిని తండ్రి ఇంటికి పిలిపించారు. రవి ఇప్పుడు పెద్దవాడయ్యాడు. పెద్దవాళ్ళలా వ్యవహరించసాగాడు.

ఇప్పుడు రవీంద్రనాథ్ పెద్దపెద్ద విషయాల గురించి వ్రాయసాగాడు. నాటకాలు, పాటలు, పద్యాలు, కథలు, వ్యాసాలు అంతులేకుండా అతని కలంనుంచి ప్రవాహంలా రాసాగాయి. ఎందరో అతని రచనల గొప్పతనం చూసి ఆశ్చర్యపడ్డారు. పాతకాలపు భావాలుగల కొందరు ఆ రచనలను విమర్శించేవారు కూడా.

లండనులో కూడా రవీంద్రనాథ్‌కు స్కూలంటే పడలేదు. 1902లో అతను తన స్వంత పాఠశాలను నెలకొల్పాడు. కొంతమంది విద్యార్థులను, పనంటే శ్రద్ధ ఉన్న టీచర్లను ఎన్నుకొన్నాడు. వాళ్ళ జీవితం సామాన్యంగా ఉండేది. ఎప్పుడూ చదువుల్లో పనుల్లో మునిగి ఉండేవారు. ఆరు బయట పాఠాలు ఏర్పాటు చేశారు. ప్రతి ఋతువుకూ, పాటలతో, నాట్యాలతో, నాటకాలతో స్వాగతం చెప్పేవారు. వాళ్ళు ప్రకృతి మాత ఒడిలో కృత్రిమమైన నగరాలకు దూరంగా ఉండేవారు. గాంధీజీ దక్షిణ ఆఫ్రికానుంచి కొందరు విద్యార్థులను తెచ్చి ఇక్కడ చదువుకని వదిలిపెట్టారు. కాలం గడిచేకొద్దీ, ఈ చిన్న స్కూలు పెద్ద విద్యాలయంగా మారింది. ఈనాటికీ రవీంద్రనాథుని ఆదర్శాలనే వీరు అనుసరిస్తున్నారు.

1913లో రవీంద్రనాథ్‌కు నోబెల్ ప్రైజు లభించింది. బహుమతిలో వచ్చిన డబ్బునంతటినీ శాంతినికేతనలోని స్కూలు కోసమే ఆయన వ్యయించేశారు.

రవీంద్రనాథ్ మృణాళినీదేవిని వివాహం చేసుకొన్నారు. ఆమె స్కూలు విషయంలో భర్తకెంతో సాయంచేసింది. ముగ్గురు కూతుర్లను, ఇద్దరు కొడుకులనూ వదిలి ఆమె చిన్న వయస్సులోనే మరణించింది. తండ్రి పోయేనాటికి వీళ్ళందరిలో పెద్దకొడుకు, చిన్న కూతురు మాత్రమే మిగిలారు. తక్కినవాళ్ళు చిన్న వయస్సులోనే చనిపోయారు.

మామిడి తోటలో వృద్ధ కవి



తన ప్రియబాంధవుల మరణాలు ఆయనకు దుఃఖం కలిగించినా ఆయన తన రచనా వ్యాసంగం మట్టుకు విడిచిపెట్టలేదు. ప్రపంచంలోని గొప్ప రచయితలలో ఒకరిగా ఆయన కీర్తి గడించారు. వీరి పాటలు, పద్యాలు, కథలు, నాటకాలు మౌలిక భావాలను తెలుపుతాయి. వారి కరుణ స్వభావాన్ని ఏదైనా పొరపాటు జరిగితే ఎదిరించటంలోగల ధైర్యాన్ని, కూడా అతని రచనలు వివరిస్తాయి. విశ్వకర్త విషయంలో ఈయనకు అపారమైన నమ్మకం ఉండేది. న్యాయమే ఎన్నటికైనా నెగ్గుతుందని అనుకునేవారు. ఆయన వ్రాసిన పాటలు, నాటకాలు, కలకాలం ఉంటాయి. వీటిలో ఎంతో చమత్కారమూ, హాస్యము ఉన్నాయి.

ఆ రోజుల్లో భారతదేశాన్ని పాలించిన బ్రిటిష్‌వారు రవీంద్రనాథ్‌ను గౌరవించేవారు. 'నైట్‌హుడ్' గౌరవాన్ని ఆయనకి ఇచ్చారు. 1919లో జలియన్ వాలా బాగ్‌లో అమాయకులైన భారతీయులను ఇంగ్లీషువారు చంపారన్న కోపంతో ఈ గౌరవాన్ని ఆయన తిరస్కరించారు.

భారత దేశమన్నా, భారతీయులన్నా ఆయనకు చాలా అభిమానం. భారతదేశ వస్తువులను, ఆచారాలను పండుగులను ఆయన ఎంతో అభిమానించారు. మనలో ఏమైన తప్పువుంటే వాటిని ఖండించటంలో ఆయన వెనుకాడేవారు కాదు. ఈరోజున జాతీయ గీతంగా మనం పాడుకొంటున్న 'జనగణమణ' ఆయన వ్రాసినపాటే, దాని రాగంకూడా ఆయన ఏర్పరచినదే. ఆయన ప్రపంచమంతా పర్యటించారు. ఆయన వ్రాసిన పుస్తకాలను చదివి భారతీయుల ఆలోచనా పద్ధతులను విదేశీయులు గౌరవించసాగారు.

రవీంద్రనాథ్ 1941లో జొరాసంకో ఇంట్లో మరణించారు. అప్పుడు ఆయన వయస్సు ఎనభై ఏండ్లు. ఈనాడు ఆయన కుటుంబ సభ్యులలో ఎవరూ జీవించిలేరు. వారి మనుమరాలు, అంటే కూతురి కూతురు ఒక్కతే కొంతకాలం జీవించి ఇటీవల కొన్ని సంవత్సరాల క్రితం మరణించింది.

ప్రస్తుతం జొరాసంకో గృహంలో రవీంద్రభారతి విశ్వవిద్యాలయం ఉంది. ఇక్కడ సంగీతం, నాట్యము, నాటకాలలో ప్రత్యేకమైన శిక్షణ ఇస్తారు. పశ్చిమ

బెంగాలు ప్రభుత్వము ఈ ఇంటిని, చుట్టూ ఆవరణాన్ని కొనుక్కొని దాన్ని పదిలంగా చూసుకొంటున్నారు. ప్రపంచం నలుమూలలనుంచి ఎందరో వచ్చి ఆ ఇంటిని దర్శించి పోతుంటారు.

ఇప్పుడు టాగూరు పేరుగల వాళ్ళెవరూ ఇక్కడ నివసించటం లేదు. శుభ్రంగా విశాలంగా ఉన్న గదులు కొన్ని రవీంద్రుని జ్ఞాపకార్థం ప్రదర్శనశాలగా మారాయి. ఇవి నిశ్శబ్దంగా ఏమాత్రం జీవంలేనట్టు ఉంటాయి. ఒకప్పుడు సంగీతంతో, సాహిత్యంతో, కార్యకలాపాలతో సందడిగా ఉన్న ఇంట్లో ఇప్పుడు జ్ఞాపకాలు మాత్రం మిగిలిపోయాయి.

ప్రస్తుతం రవీంద్ర భారతి వున్న జోరాసాంకో యిల్లు



# చిన్ననాటి జ్ఞాపకాలు

నిన్నటి సాయంత్రం నుంచి మబ్బులకు విశ్రాంతే లేదు. తెరిపి లేకుండా వాన కురుస్తూనేఉంది. చెట్లు ముడుచుకుపోయి వానలో మూర్ఖంగా నిలుచున్నట్లున్నాయి. పక్షులు నిశ్శబ్దంగా ఉన్నాయి. ఇప్పుడు నా చిన్ననాటి రోజులు గుర్తుకువస్తున్నాయి.

మా సాయంకాలాలు మేము పనివాళ్ళ ఇళ్ళదగ్గిర గడిపేవాళ్ళం. అప్పటికి ఇంకా ఇంగ్లీషు స్పెల్లింగులు, అర్థాలు భూతల్లా బాధించేవికావు. మా మూడో అన్న అనేవాడు, మొదట బెంగాల్‌లో బాగా పునాదిపడిన తర్వాతే ఇంగ్లీషు చదువు అని. అందుకే నా వయసు పిల్లలంతా "ఐయామ్ అప్" "హి ఈజ్ డౌన్" అని వల్లెవేస్తున్నప్పుడు నేను బియేడీ-బాడ్ అనిగాని యమ్‌యేడీ-మాడ్ అనిగాని నేర్చుకోలేదు.

నవాబుల భాషలో పనివాళ్ళ ఇళ్ళను అప్పుడు "తోషా ఖానా" అనేవారు. ఇంతకు ముందున్న జమీందారీ పద్ధతులన్నీ మా ఇంట్లో తగ్గిపోయినప్పటికీ తోషాఖానా. దఫ్తర్‌ఖానా (ఆఫీసుగది), బైఠక్‌ఖానా (కూర్చునే గది-డ్రాయింగ్ రూము) అనే పేర్లు మాత్రం మిగిలిపోయాయి.

తోషా ఖానాకు దక్షిణంవైపు ఒక పెద్దగదిలో ఒకగాజు దిమ్మెపై ఆముద దీపం వెలుగుతుండేది. గోడమీద గణేశుని పటము పల్లెటూర్లలో చిత్రించిన కాళికాదేవి పటము వేలాడు తుండేది. వాటి చుట్టూ పెద్దపెద్ద బల్లులు పురుగుల్ని పట్టుకోటానికి పరుగెత్తుతుండేవి. ఆ గదిలో బల్లలు, కుర్చీలు ఏమీ ఉండేవికావు. మురికి చాప ఒకటి మాత్రం నేలమీద పరిచి ఉండేది.

బయట ఒక మూలగా చింతచెట్టుక్రింద రెల్లుగడ్డి కప్పిన పందిరిలాంటిది ఉండేది. అక్కడ మురిగ్గా ఉన్న బండి. ముసలి గుఱ్ఱము ఉండేవి. మేమందరం చాలా సామాన్యమైన చౌకబారు దుస్తులు తొడుక్కునే వాళ్ళము. మేజోళ్ళవాడకం కూడా ఆ తర్వాత ఎప్పటికో ప్రారంభించాం. వ్రజేశ్వర్ మామూలు వంటవాళ్ళే కాకుండా బ్రెడ్డు, వెన్న అరటి ఆకులో టిఫిను రూపంలో మాముందుంచినప్పుడు అదెంతో గొప్పగా భావించేవాళ్ళము. నశిసిపోతున్న మా గత వైభవానికి మేము సులభంగానే అలవాటు పడ్డాము. వ్రజేశ్వర్ చాపలమీద కూర్చున్న మా అందరికీ అధ్యక్షత వహించేవాడు. అతని జుత్తు, గడ్డము నెరిసిపోయి ఉండేవి. మనిషి చూడటానికి చాలా గంభీరంగా ఉండేవాడు. ముఖము చర్మము ఎండిపోయి బిగుసుకున్నట్లుండేది. గొంతు కఠినంగా ఉండేది. మాట పట్టి, పట్టి మాట్లాడేవాడు. ఇంతకుముందు అతను చాలా గొప్పవారి ఇంట్లోనే పనిచేశాడు. పరిస్థితుల ఒత్తిడివల్ల ఇప్పుడు మా లాంటి పిల్లలను చూసుకోవలసి వచ్చింది. ఏదో వీధిబడిలో ఇతను టీచరుగా పనిచేశాడని విన్నాను. జీవితాంతం వరకు స్కూలు మాష్టారులా మాట్లాడటం మాత్రం పోలేదు "పెద్దమనుషులు మీ కోసరం ఎదురుచూస్తున్నారు" అనటానికి బదులుగా పెద్దలు నిరీక్షిస్తున్నారు అనేవాడు. అతని ధోరణి చూసి అతని యజమానులు నవ్వుకొనేవారు. కులం విషయంలో కూడా అతనికి చాలా పట్టింపులు ఉండేవి. చెరువులో స్నానానికి వెళ్ళేటప్పుడు పైపై ఉన్న నీళ్ళను రెండుచేతులతోనూ ఐదారు సార్లు వెనక్కు తోసి ఆ తర్వాత చెరువులో మునిగేవాడు. చెరువునుంచి ఇవతలికి వచ్చాక వొదిగి వొదిగి ఒక పక్కగా తోటలోనుంచి వెళ్ళిపోయేవాడు. అతని ధోరణిచూస్తే దేవుడు చేసిన ఈ మురికి ప్రపంచానికి దూరంగా ఉండి తన

ణాలి నిలుపుకోవాలనుకొంటున్నాడేమో అనిపించేది. నడతలో, మాటలో ఏది మంచో, ఏది చెడో అతను ఖచ్చితంగా చెప్పేవాడు. ఆ చెప్పటంకూడా తల ఒక పక్కకు వంచి చెప్పేవాడు. దానితో అతని మాటలకు చాలా ప్రాముఖ్యమున్నట్లు తోచేది.

అయితే గురువుగా అతనిలో కొంతలోపం ఉండేది. తిండిపట్ల చాలా ఆశ ఉండేది. మేము భోజనానికి కూర్చునేముందు మాకు కావలసినంత పళ్ళెంలో ముందుగా పెట్టేవాడుకాదు. మేము భోజనానికి కూర్చోగానే మాకు కొంత దూరంలో చేతితో ఒక పూరీ పట్టుకొని "ఇంకా కావాలా" అని అడిగేవాడు. ఆ అడిగేపద్ధతి "ఇకవద్దు అని చెప్పండి" అన్నట్టుండేది. నేను అలాగే అనేవాడిని. ఆ తర్వాత మేము మా మాట మార్చటానికి కూడా అవకాశముండేదికాదు. పాల విషయంలోనూ ఇంతే జరిగేది. అతనిగదిలో ఇనుపకమ్మీల జల్లెడ ఉన్న అలమారు ఒకటి ఉండేది. దానిమీద ఇత్తడి పాత్రలలో పాలు ఉండేవి. పూరీలు, కూరలు కర్ర పాత్రలలో ఉండేవి. ఇనుప తెరకు అవతల ఆ వాసనలు పీలుస్తూ పిల్లి ఒకటి తిరుగుతుండేది.

నా పసితనం నుంచి పరిమితంగా తినటం నాకు అలవాటయింది. తక్కువ తిన్నంత మాత్రాన నేనేమీ బలహీనుణ్ణికాలేదు. నాకంటే ఎక్కువతినే వాళ్ళకంటే బలంగానే ఉండేవాడిని. నా శరీరారోగ్యం చాలా బాగుండేది. ఎప్పుడైనా ఏదో ఒక సాకుతో బడి ఎగగొట్టాలన్నా కుదిరేదికాదు. బాగా వానలో తడిపి ముద్దయ్యేవాణ్ణి. అయినా జలుబు చేసేదికాదు. బాగా మంచుపడుతున్నప్పుడు పైడాబామీద తిరిగేవాణ్ణి నా జుత్తు, బట్టలు చల్లగా అయిపోయేవిగాని నాకు దగ్గువచ్చే ఛాయలుకూడా కనిపించేవి కావు. అజీర్ణంతోవచ్చే కందుపునొప్పి ఏమిటో నా పొట్టకు తెలీదు. అప్పుడప్పుడూ ఏదైనా సాకు కావాలని మా అమ్మదగ్గర కడుపునొప్పి అని చెప్పేవాడిని. అమ్మ నవ్వుకొనేది. ఏ మాత్రం ఆత్రుత కనపరచేదికాదు. పనివాడిని పిలిచి "ఈ సాయంకాలం రవికి పాఠాలు చెప్పొద్దని మాష్టారితో చెప్పు" అనేది. పిల్లలు ఎప్పుడైనా బడికి పోకపోతే ముంచుకుపోయేది ఏమీ లేదని పాతకాలపు తల్లులు భావించేవారు.

ఎప్పుడైనా నా శరీరం వేడెక్కితే ఎవరూ ''జ్వరం'' అనేవారు కాదు. ''వేడి చేసిందిలే'' అనేవారు. ఆ రోజుల్లో థెర్మామీటరు చూసి ఎరుగను. డాక్టర్ ఏల్ మాధవ్ వచ్చి నా ఒళ్ళుపట్టి చూసి ఆముదం తీసుకుని ఉపవాసం ఉండమనేవారు. కొద్దిగా వేడినీళ్ళు తాగనిచ్చేవారు దానిలో కొంచెం చక్కెర, ఏలక్కాయలు వేసి ఇచ్చేవారు. ఈ ఉపవాసమయ్యాక మూడోరోజు మౌరాలా చేపల పులుసు, మెత్తగా ఉడికించిన అన్నం పెట్టేవారు. అది నా ప్రాణానికి అమృతమనిపించేది. తల్లులు తమ పిల్లలు ఆరోగ్యంగా ఉండాలని ఒక రోజయినా బడి మానకుండా చదవాలని అనుకొంటే, ప్రజేశ్వర్ లాంటి వంటవాడిని వెతుక్కొంటే బాగుంటుంది. అప్పుడు వంటకు ఖర్చు తక్కువ అవుతుంది. అటు డాక్టర్ల బిల్లులు కూడా ఉండవు.

ఆ రోజుల్లో చాకొలెట్లు బజార్లలో దొరికేవి కాదు. గులాబీ రంగులో చప్పరించుకోవటానికి మిఠాయి ఉండలాంటిది ఒక్కొక్క పైసకు దొరికేది. ఈ రోజుల్లో పిల్లలు ఎవరైనా జిగటగా ఉండి, నువ్వులద్దిఉన్న ఆ చక్కెర ఉండను కొనుక్కు తింటున్నారేమో నాకు తెలీదు.

సాయంకాలాల ప్రజేశ్వర్ రామాయణంలోని శ్లోకాలు చదువుతుంటే వినేవాణ్ణి. ఒకోసారి కిషోరీ ఛటర్జీ కూడా వచ్చేవారు. మొత్తం రామాయణం పాంచాలి జాన పదంలో అతనికి కంఠతా వచ్చేది ఒక్కసారిగా అతను పాట అందుకొనేవారు. కృత్తిబస రామాయణం ఎక్కడికి పోయేదో! నిండు కంఠంతో ఒక పదం తర్వాత మరో పదం పాడుతుంటే సెలయేరు గులకరాళ్ళ మీద ప్రవహిస్తున్నంత మధురంగా ఉండేది. కిశోరీ ఛటర్జీ అంటుండేవారు – దాదాభాయ్ (నేను) తనతో చేరి ఊరూరు నాటకాలు వేస్తే ఎంతో పేరు వచ్చేది అని.

బాగా చీకటి పడ్డాక మా సమావేశం ముగిసేది. మేము మా అమ్మ గదికి వెళ్ళే వాళ్ళం. అమ్మ తన మేనత్తతో పేకాడుతుండేది. నేల దంతంలా తెల్లగా మెరుస్తుండేది. పైన కూర్చునే దివాన్ మీద చక్కటి దుప్పటి పరచి ఉండేది.

మేము బాగా అల్లరిచేసే వాళ్ళం. దానితో అమ్మ ఆట ఆపేసి, ''అత్తా వీళ్ళంత అల్లరి చేస్తుంటే ఆడటం కల్ల నువ్వు వెళ్ళి వాళ్ళకు కథలు చెప్పు.'' అనేది.

వరండాలో కుండలోనుంచి నీళ్ళు ముంచుకొని, కాళ్ళు కడుక్కొని పడుకోవ టానికి మంచాలెక్కేవాళ్ళం, మాతో పాటు మామ్మ కూడా.

అప్పుడు కథలు మొదలవుతాయి .... రాజకుమారి మంత్ర నిద్ర నుంచి మేల్కోవటం, రాకుమారుడు రాక్షస నగరునుండి ఈమెను రక్షించటం. రాజకుమారి నిద్రలేచేదేమోగాని నాకు మాత్రం బాగా నిద్ర పట్టేది.

అర్ధ రాత్రివేళ అప్పుడప్పుడూ నక్కల అరుపులు వినిపిస్తుండేవి. ఆరోజుల్లో కలకత్తాలోని పాత ఇళ్ళ దరిదాపుల్లో నక్కలు తిరుగు తుండేవి.

# చిలుకకు శిక్షణ

చాలాకాలం క్రింపట ఒక పక్షి ఉండేది. అది మూర్ఖపు పక్షి. పాటలు బాగానే పాడేది. కాని ధర్మగ్రంథాలు ఎప్పుడూ వల్లెవేసేది కాదు. చాలా త్వరత్వరగా ఎగిరేది. కాని సోయగం ఉండేది కాదు.

రాజు తనలో తను ఇలా అనుకొన్నాడు. ''మూర్ఖత్వం చాలా అపకారం చేస్తుంది. మూర్ఖులు విజ్ఞులకంటె ఎక్కువ తిండి తింటారు కాని వారు సమాజానికి చేయగలిగినది చాలా తక్కువ.''

తన తమ్ముడి పిల్లలను పిలిచి, ఆ పక్షికి మంచి శిక్షణ ఇవ్వవలసిందిగా చెప్పారు.

పండితులను పిలిపించాడు. వాళ్ళు మూల కారణం పరిశీలించారు. పక్షులు తమ చిన్న గూళ్ళలో ఉన్నందున అవి మూర్ఖంగా ఉంటాయని తేల్చారు. కాబట్టి పక్షిని చదివించాలంటే దానిని తగిన పంజరానికి మార్చాలి.

పండితులు తమ బహుమానాలు అందుకొని సంతోషంగా ఇళ్ళకు వెళ్ళారు. మంచి అలంకారాలతో బంగారు పంజరం ఒకటి తయారయింది. ప్రపంచంలోని నలుమూలల నుండి ఆ పంజరాన్ని, చిలుకను చూడటానికి జనం వచ్చారు.

''ఆహా సంస్కృతినే పట్టుకొని బంధించారు కదా'' అన్నారు కొందరు. సంతోషం పట్టలేక ఆనందబాష్పాలు రాల్చారు.

మరికొందరన్నారు : "సంస్కృతి పోయినా చివరకు పంజరం మిగులుతుంది కదా! పక్షి ఎంత అదృష్టం కలది!"

పంజరం చేసిన కంసాలి డబ్బుతో తన సంచీ నింపుకొని ఇంటికి వెళ్ళారు.

పండితుడు పక్షిని చదివించటానికి కూర్చున్నాడు. ముక్కులో నశ్యం దట్టించి, అన్నాడు. "ఎన్ని పాఠ్యపుస్తకాలున్నా అవి ఎక్కువ కానే కావు."

రాజుగారి తమ్ముని పిల్లలు ఎన్నో గ్రంథాలు తెచ్చారు. వ్రాతగాళ్ళను పిలిచారు. వాళ్ళు పుస్తకాల నుంచి వ్రాశారు. వ్రాత ప్రతులనుండి వ్రాశారు అన్నీ పెద్ద కుప్పగా తయారయ్యాయి. పెద్ద ఎత్తున పెరిగాయి.

చూస్తున్న వాళ్ళంతా ఆశ్చర్య పోయారు. "అబ్బా సంస్కృతి బురుజు ఎంత ఎత్తుగా ఉంది! దాని కొన మేఘాలు తాకేటట్లు ఉంది."

వ్రాతగాళ్ళు తను సంచులు డబ్బుతో నింపుకొని ఇళ్ళకు వెళ్ళిపోయారు.

రాజుగారి తమ్ముడి పిల్లలు పంజరాన్ని ఆకర్షణీయంగా పెట్టటంలో నిమగ్నులయ్యారు.

వాళ్ళు పంజరాన్ని తుడిచి బాగా మెరుగు పెడుతుంటే ప్రేక్షకులన్నారు. "ఆహా ఇది కదా ప్రగతి!"

పంజరాన్ని సరైన తీరున పెట్టటానికి ఎందరినో ఉద్యోగంలో పెట్టారు, వారి పనులు పర్యవేక్షించటానికి మరికొందర్ని నియమించారు. ఈ పనివాళ్ళు తమ బంధు బలగాన్ని పిలిపించారు. వాళ్ళంతా ఉండటానికి పెద్ద భవనం కట్టించుకొన్నారు. అందరూ సుఖంగా ఉన్నారు.

లోకంలో ఏది ఉన్నా లేకపోయినా తప్పులెన్నే వారికిమాత్రం కొరత లేదు. పక్షితో ఏమాత్రం సంబంధం ఉన్నా, అది ఎంత దూర సంబంధమైనా సరే, ఆ సంబంధీకులు అందరూ బాగుపడ్డారు. బాగు పడనిదల్లా ఆ పక్షి ఒకటె అంటూ ఈ తప్పులెన్నే వారు ప్రచారం చేయసాగారు.

ఈ మాటలు రాజు చెవిని పడగానే అతను తన తమ్ముడి పిల్లలను పిలిపించాడు. "ఏమిటబ్బాయిలూ, నేను విన్నది నిజమేనా ?"

వాళ్ళు ఈ విధంగా సమాధానమిచ్చారు. "మహారాజా, కంసాలీలను, పండితులను, వ్రాతగాళ్ళను, పర్యవేక్షకులను అడిగి నిజం తెలుసుకోండి. తప్పులెన్నే వారికి మరింకేనీ పనిలేదు. అందుకే తప్పుడు ప్రచారం మొదలు పెట్టారు.

ఈ సమాధానం రాజుకు బాగా నచ్చింది. తన తమ్ముని పిల్లలకు తన స్వంత ఆభరణాలను కొన్నిటిని బహుమానంగా ఇచ్చాడు.

అసలు పక్షికి విద్యాబోధ ఎలా జరుగుతోందో స్వయంగా చూద్దామని రాజు ఆ పక్షి ఉన్న విద్యాశాలకు వెళ్ళాడు. సింహద్వారం దగ్గిర శంఖాలు మోగాయి. గంటలు వినిపించాయి. కొమ్ములు ఊదారు. డప్పులు మోగాయి. వేణువులు వినిపించాయి. అన్ని వాద్యాలూ మోగాయి. పండితులు గొంతెత్తి మంత్రాలు చదివారు. కంసాలులు, వ్రాతగాళ్ళు, పర్యవేక్షకులు, వారి బంధు బలగమూ పెద్దగా జయ జయ ధ్వానాలు చేశారు.

రాజుగారి తమ్ముని పిల్లలు చిరునవ్వుతో రాజును అడిగారు. "ఇదంతా చూశారుగా మీ అభిప్రాయమేమిటి ?"

"చాలా మంచి పద్ధతిలా ఉంది. విద్యాబోధనకు సరైన పద్ధతి" అన్నాడు రాజు.

రాజు ఎంతో తృప్తిగా తన ఏనుగెక్కబోయాడు. ఇంతలో పొదల మాటు నుంచి, తప్పులెన్నేవాడొకడు, "మహారాజా, ఇంతకూ పక్షిని చూశారా ?" అన్నాడు.

"అయ్యో లేదే" అన్నాడు రాజు. "పక్షిని పూర్తిగా మరిచే పోయాను." పక్షికి విద్యాబోధన ఏవిధంగా జరుగుతోందో చెప్పమని రాజు పండితులనడిగాడు.

రాజుకు అంతా చూపించారు. ఆ పద్ధతి చూసి రాజుకెంతో సంతోషం

కలిగింది. ఇంత అమోఘ పద్ధతి ముందు ఆ పక్షి అనామకంగా కనిపించింది. ఏర్పాట్లలో ఏమాత్రం లోపంలేదని రాజుకు తృప్తి కలిగింది. పక్షి తన ఇబ్బంది చెప్పుకునే స్థితిలో లేదు. పుస్తకాల కాగితాలతో దాని గొంతు పూడుకుపోయింది. గొణగటానికి గాని, ఈలవేయటానికి గాని దానికి సాధ్యంకాదు. ఈ పద్ధతి మొత్తం చూస్తే ఒళ్ళు పులకరించేటట్లు ఉంది.

ఈ సారి ఏనుగు ఎక్కబోయే ముందు రాజాగారు తన కొలువులో చెవిని మెలిపెట్టే వాడికి ఆజ్ఞ ఇచ్చారు. తప్పులెన్నే వాడి రెండు చెవులూ బాగా మెలిపెట్టమని.

వ్యర్థమైన పద్యాలు పక్షి నేర్చుకోసాగింది. ఆ ప్రగతి చాలా గొప్పగా ఉంది. అయినా అప్పుడప్పుడూ ప్రకృతి తన విజయాన్ని ప్రకటిస్తూ ఉండేది. ఉదయ కిరణాలు పక్షి ఉన్న పంజరాన్ని తాకినప్పుడు అది తన రెక్కలు రెపరెపలాడించేది. నమ్మటానికి వీలుకాకున్నా, అది ఎంతో దయనీయంగా తనముక్కుతో పంజరం కమ్మీలు పొడిచేది.

"ఎంత పొగరు!" అన్నాడు కొత్వాలు. రాజాగారి విద్యాశాఖలో కంసాలి తన కొలిమితో, సుత్తితో ప్రత్యక్షమయ్యాడు. ఆహా! ఆ ధ్వనులు ఎంతగా ప్రతిధ్వనించాయి! ఇనుప గొలుసు త్వరలో తయారయింది. పక్షి రెక్కలు విరిచేశారు.

రాజాగారి బావమరదులన్నారు – "ఈ పక్షులకు బుద్ధి లేదు సరికదా, కృతజ్ఞత కూడాలేదు."

చేతిలో బెత్తంతో, మరో చేతిలో పుస్తకంతో పండితులు పాఠాలు బోధించటం మొదలు పెట్టారు.

కొత్వాలు అప్రమత్తతతో ఉన్నందుకు, కంసాలి మంచి ఇనుప గొలుసు చేసి నందుకు, బహుమానాలు పొందారు.

పక్షి మరణించింది. అది ఎప్పుడు చనిపోయిందో ఎవరికీ తెలీదు. తప్పులెన్నే వాడు మొట్టమొదటగా ఈ ప్రచారం ప్రారంభించాడు.

రాజా తన తమ్ముడి పిల్లలను పిలిపించాడు. "అబ్బాయిలూ, నేను వింటున్న దేమిటి ?" వాళ్ళన్నారు. మహారాజా, పక్షికి చదువు పూర్తయింది."

"అది గెంతుతుందా ?" అన్నాడు రాజా.

"ఊహూ"

"ఎగురుతుందా ?"

"ఊహూ"

"ఆ పక్షిని ఇలా తీసుకురండి" అన్నాడు రాజా.

కొత్వాలు, సిపాయిలు, రౌతులు చుట్టుముట్టి పక్షిని తీసుకొచ్చారు. రాజా ఆ పక్షి శరీరాన్ని వేలితో తాకాడు. లోపలున్న కాగితాలు పెళపెళలాడాయి.

కిటికీ బయట వసంత ఋతుపవనం అశోకవృక్షంలోని చిగుళ్ళను తాకింది. ఏప్రిల్ మాసంలోని ఆ ఉదయం కాస్త విచారంగా కనిపించింది.

# కవిత

వసంత ఋతు పుష్పంలో

శరత్కాలపు వంటలో

చిన్నారి నీశరీరంలో

నీ కలలలో, ఆలోచనలలో

సాగుతోంది నృత్యం

ఆదిదేవుని లాస్యం

# గాంధీమహరాజు

మనకు, గాంధీజీ అనుయాయులకు
ఒకగుణం సర్వ వ్యాప్తంగా ఉంది.
పేదలను కొట్టి మన సంచులను నింపుకోము
ధనవంతుల పాదాలకు దాసోహం అనము.
పిడికిలి బిగించి, కర్రెత్తి
వాళ్ళు బెదిరిస్తూ వచ్చినపుడు

మన సమాధానం చిరునవ్వు.
"మీరు తమరెర్ర చేస్తే
నిద్రించే పాపలు దడుసుకోవచ్చు
కాని దేనికీ భయపడని
మేము మీకెలా భయపడుతాం ?"
మన మాటలు సరళం
వాటికి పెడార్థాలు లేవు
కలవరపెట్టే పీనల్ కోడ్ కాదు
అవి ఎంతో సునాయాసంగా
మనల్ని జైలు దాకా నడిపిస్తాయి
కారాగారం చేరుకోగానే
జనసందోహపు అవమానాలు తుడుచుకుపోతాయి
తరతరాల శృంఖలాలు రాలి పడతాయి
వారి నుదుటిపై మెరుస్తుంది
గాంధీజీ ఆశీర్వచనం.